


























5 పండ్ల సువాసనలలో 13 మధురమైన బిళ్ళలు ప్రతి ప్యాక్‌లో నిమ్మ, మోసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరీ!

# పెరిగే వయస్సుకు ప్రియ మిత్రము - ఇన్‌క్రిమిన్*!





ఉత్సాహంగా జీవితం. పెల్లుబికే శక్తి సంపూర్ణమైన ఆరోగ్యం! పెరిగే వయస్సులో మీ పిల్లలకు ఇన్‌క్రిమిన్ టానిక్ ఇవ్వండి. ఇన్‌క్రిమిన్ సిరప్‌లో ఉపయోగకరమైన విటమిన్లు, ఐరన్ మరియు అవసరమైన అమినో ఏసిడ్ - పెరిగే వయస్సులో ముఖ్యమైనవి అన్నీ వున్నాయి.

## ఇన్‌క్రిమిన్*

**ఇన్‌క్రిమిన్ టానిక్—పెరిగే పిల్లలకు వరప్రసాదం!**

డాక్టర్లు విశ్వసించే పేరు. (Lederle) అమెరికన్ సయనమిడ్ కంపెనీ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.
ఏ డివిజన్ ఆఫ్ సయనమిడ్ ఇండియా లిమిటెడ్

SISTA'S-INC-48 TEL

# స్కూలుకు వెళ్ళేప్పుడు, స్కూల్లోను స్కూలునుంచి వెళ్ళేప్పుడు

వీరు న్యూట్రిన్ మిఠాయిలలో ఒక నూతన రుచుల ప్రపంచాన్ని అన్వేషించారు. పుష్టికరమైన పాలు, తేనె, మాల్టు, చక్కెరలతో మిళితమైన కోకోనట్ బాన్ బాన్‌లు, ఆరెంజ్ క్యాండీలు, ల్యాక్టో బాన్ బాన్‌లు, కాఫీ టాఫీలు. నోరూరించే సంతోషపూరితమైన మిఠాయిలు. ఇవేకాక మరెన్నో రుచులు, రకాలలో న్యూట్రిన్ మిఠాయిలు.

అద్భుతమైన న్యూట్రిన్ ప్రపంచానికి మీ పిల్లలనుకూడా పరిచయం చేయండి.



## సర్వదా వీరు న్యూట్రిన్ గురించే మాట్లాడుకుంటుంటారు




# న్యూట్రిన్

ఒక్కొక్క మిఠాయి యందు ఫలరస పూరిత విందు

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, సంపనేర్ రోడ్, చిత్తూరు (ఆం.ప్ర.)

# పాలన పోషణ సరిగా చెయ్యండి
# పిల్లలకు బోర్న్‌విటా ఇవ్వండి!



## చదువులలో సర్వశ్రేష్ఠత ...
## ఆటలలో అగ్రగణ్యత

పోషకమైన బోర్న్‌విటాలో కోకో ఉన్నది. అది ఆరోగ్యకరం, రుచికరం కూడా.

చదువుల్లో ఆటల్లో హరింపు అయే శక్తిని పిల్లలకు తిరిగి సమకూర్చక పోతే వారి మానసిక శారీరక వికాసానికి ఆటంకం కలుగుతుంది. ప్రతి దినం వారు బోర్న్‌విటా త్రాగటం వలన పిల్లల శక్తి పెరుగుతూ ఉంటుంది. పుష్టికరమైన కోకో, పాలు, మాల్ట్ మరియు పంచదారలతో తయారైన బోర్న్‌విటా రుచికరమైనది.






శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం **క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**



# చందమామ

సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల బేతాళ కథ ["వాగ్దానభంగం"] రచించినది పి. వి. ఎస్. జగన్మోహనరావు.

ఏ పదవికైనా అర్హతగలవాణ్ణి నియమించాలి. వాడి ఇతర గుణాలు గణనలోకి రావు. "వాగ్దానభంగం" అన్న కథలో, రాజు తన అనంతరం రాజు అయేవాణ్ణి ఎన్నుకోవటంలో తన పైన ఏ మాత్రమూ లక్ష్యం లేని వాణ్ణి ఎన్నుకోవటమేగాక, తాను లోగడ చేసిన వాగ్దానాలనన్నిటినీ భంగం చేశాడు. రాజు ఆశ్రితపక్షపాతం చూపి ఉంటే అనర్హుడు రాజు అయేవాడు.

సంపుటి 53 నవంబర్ '73 సంచిక 5






ధన్యా స్తే పురుషశ్రేష్ఠా యే బుద్ధ్యా కోప ముద్ధితం
నిరుంధంతి మహాత్మానో దీప్త మగ్ని మివాంభసా. 1

[కోపం వచ్చినప్పుడు ఆ కోపాన్ని, మంటలను నీరుచే ఆర్పినట్టు నిగ్రహించుకునే పురుషశ్రేష్ఠులు మహాత్ములు.]

క్రుద్ధః పాపం న కుర్యాత్ కః క్రుద్ధోహన్యాత్ గురూనపి,
క్రుద్ధః పరుషయా వాచా నర స్సాధూ నధిక్షిపేత్. 2

[క్రోధం కలిగిన వాడెవడు పాపం చెయ్యకుండా ఉంటాడు ? అలాటి వాడు గురువును కూడా చంపుతాడు. కోపిష్ఠి అయినవాడు మంచివాళ్ళను కూడా పరుషవాక్యాలతో తిరస్కరిస్తాడు.]

వాచ్యావాచ్యం ప్రకుపితో న విజానాతి కర్హిచిత్,
నా కార్య మస్తి క్రుద్ధస్య. నా వాచ్యం విద్యతే క్వచిత్. 3

[కోపం వచ్చినవాడికి అనదగిన మాటా, అనరాని మాటా అంటూ ఉండదు. వాడికి చెయ్యరాని పనీ, అనరాని మాటా తెలియదు.]

య స్సముత్పతితం క్రోధం క్షమయైవ నిరస్యతి
య థోరగ స్త్వచం జీర్ణాం స వై పురుష ఉచ్యతే. 4

[పాము శిథిలమైన తన చర్మాన్ని — కుబుసాన్ని — ఎలా విడుస్తుందో, అలాగే తనకు కలిగిన కోపాన్ని ఓర్పుతో విసర్జించేవాడే నిజమైన పురుషుడు.]

వాల్మీకి



# యక్షపర్వతం

## 18

[వీరపుర సైనికులను ఓడించిన సమరబాహు అనుచరులు, ఆటవికుల సాయంతో బోనుల్లో చిక్కిన సింహాన్నీ, పులులనూ తీసుకుని స్వర్ణాచారి వద్దకు వెళ్ళారు. సమరబాహు అనుచరులకు దొరక్కుండా తప్పించుకున్న జంతు ప్రదర్శనశాలాధికారీ, మరొక వీరపుర సైనికుడూ గుర్రాల మీద వీరపురనగరం చేరారు. తరవాత—]

వీరపురరాజుగారి జంతు ప్రదర్శనశాలాధికారీ, సైనికుడూ గుర్రాలను రాజ వీధి వెంట దౌడు తీయిస్తూ చేస్తున్న హెచ్చరికలూ, ప్రజలు వీధుల వెంట పరిగెత్తుతూ చేస్తున్న గోలా, రాజు వీరసింహుడూ, ఆయన మంత్రీ విన్నారు. ఆ సమయంలో వాళ్ళిద్దరూ రాజప్రాసాదం పైన పచార్లు చేస్తూ, ఏవో రాచకార్యాల చర్చ సాగిస్తున్నారు.

రాజు వీరసింహుడు ముందుగా ప్రాసాదం పిట్టగోడ మీది నుంచి దిగువనున్న రాజ మార్గం కేసి చూసి, ఆశ్చర్యపోతూ మంత్రిని పిలిచి, "మహామంత్రీ, ఏమిటిది? మన జంతు ప్రదర్శనశాలాధికారి, ఒక సైనికుణ్ణి వెంట వేసుకుని, ఏ సింహాలో, పులులో వెంటపడి తరుముతున్నట్టు అరుస్తూ పారిపోతున్నాడు? సేవకుల్ని పిలిచి సంగతేమిటో కనుక్కొరమ్మనండి." అన్నాడు.



మంత్రి కూడా పిట్టగోడ మీది నుంచి కిందికి చూశాడు. అతడికి జంతు ప్రదర్శనశాలాధికారే కాక, ప్రజలు కూడా కేకలు పెడుతూ వీధుల వెంట పరిగెత్తుతూండటం కంటబడింది. అతడు కోట ద్వారం దగ్గిర కాపలా వున్న భటుణ్ణి కేకవేసి, సంగతేమిటో కనుక్కుందాం అనుకునే లోపలే జంతు ప్రదర్శనశాలాధికారీ, సైనికుడూ ద్వారం దగ్గిరకు వచ్చారు. కాపలా భటుడు అతణ్ణీ, వెంట వున్న వాణ్ణీ ఆపి, గుర్రాలు దిగి లోపలికి పొమ్మన్నాడు.

జంతు ప్రదర్శనశాలాధికారి అందుకు ఒప్పుకోక, పెద్దగా గొంతెత్తి, "ఏమిటి నువ్వనేది? ఒక వైపున దేశం ప్రమాదంలో చిక్కుకునుంటే, ఈ లాంఛనాలతో కాలయాపన చెయ్యాలని చూస్తున్నావా?" అంటూ అరిచాడు.

"దేశానికి ప్రమాదం! రాజ్యానికి ముప్పు! శత్రువులు...." అని అరుస్తూ సైనికుడు గుర్రాన్ని వేగంగా ద్వారం దాటించబోయేసరికి, కాపలా భటుడు ఈటెను తిప్పి, సైనికుడి డొక్కలో ఒక్క పోటు పొడిచాడు.

సైనికుడు గుర్రం మీంచి తల్లకిందులుగా పడిపోతూ, "వీరసింహమహారాజుకూ, జై!" అంటూ కేకపెట్టాడు.

భవనం మీది నుంచి యీ దృశ్యాన్ని చూసిన రాజు వీరసింహుడు ఎంతో ఆనందపడిపోతూ, మంత్రితో, "చూశారా, మన సైనికుల రాజభక్తి! ఇలాంటి వాళ్ళ సాయంతో మనం ఎన్నెన్ని రాజ్యాలను జయించవచ్చు! కాని, మనం అలాంటి క్షత్రియ ధర్మాలను నిర్వర్తించకుండా మన సైనికుల రాజభక్తిని అడవికాచిన వెన్నెల చేస్తున్నాం," అన్నాడు.

మంత్రికి, రాజు మాటలు చాలా అసందర్భంగా తోచినై. జంతు ప్రదర్శనశాలాధికారీ, సైనికుడూ, ద్వారం కాపలా భటుడితో అన్న మాటలు కొన్ని ఆయనకు వినబడినై. రాజ్యానికి ఏదో ప్రమాద పరిస్థితి కలగనున్నదని తెలుసుకునే, వినే వాళ్ళు అంత

హడావిడిగా రాజభవనం దగ్గిరకు వచ్చి వుంటారని ఆయనకు తోచింది.

మంత్రి చేయెత్తి కావలా భటుణ్ణి కేక వేసి, "ఒరే, వాళ్ళిద్దర్నీ గుర్రాలతోనే, గుర్రాలు లేకుండానో — ఎలాగో ఒకలా త్వరగా లోపలికి రానియ్యి." అని చెప్పాడు.

మంత్రి ఆజ్ఞ వింటూనే కావలాభటుడు, జంతు ప్రదర్శనశాలాధికారికి దారి యిచ్చి, గుర్రం మీంచి కింద పడిన సైనికుణ్ణి లేపి నిలబెట్టాడు. ముందు జంతు ప్రదర్శన శాలాధికారి గుర్రం మీదా, వెనక కుంటు కుంటూ సైనికుడూ భవన ప్రాంగణం లోకి వచ్చారు. మంత్రి ఒక సేవకుణ్ణి పిలిచి వాళ్ళిద్దర్నీ తన దగ్గిరకు తీసుకు రావలసిందిగా ఆజ్ఞాపించాడు.

జంతు ప్రదర్శనశాలాధికారీ, సైనికుడూ భవనం పైకి వచ్చి, రాజునూ, మంత్రినీ చూసి నమస్కరించి, కొంచెం దూరంగా చేతులు కట్టుకు నిలబడ్డారు. మంత్రి తీవ్ర కంఠ స్వరంతో, "మీరిద్దరూ రాజ భృత్యులు గదా! రాజభవన ప్రాంగణం లోకి గుర్రాలెక్కి రాగూడదన్న సంగతి తెలియదా?" అని అడిగాడు.

జంతు ప్రదర్శనశాలాధికారి ఆ ప్రశ్న వింటూనే వణికిపోతూ, "మంత్రిగారు క్షమించాలి. రాజ్యం ప్రమాదంలో వుండటం కళ్ళారా చూసినందువల్ల కలిగిన ఆవేశా వేగాల్లో ఆ సంగతి మరిచాం." అన్నాడు.

ఈ జవాబు రాజు వీరసింహుణ్ణి ఆశ్చర్య చకితుణ్ణి చేసింది. వీరపుర రాజ్యం ప్రమాద





స్థితిలో వుందా? ఎలా? ఎవరివల్ల? ఆయన జంతు ప్రదర్శనశాలాధికారి కేసి కళ్ళు చికిలించి చూస్తూ ప్రశ్నించబోయేంతలో మంత్రి కనుబొమలు ముడిచి, "రాజ్యానికి ప్రమాదమా? ఎవరు దండెత్తి వస్తున్నారు? మన సైన్యాలన్నీ రాజ్యపుటెల్లల్లో కాపలా కాస్తున్నవి గదా? అలాంటి శత్రుదాడి రావటం జరిగితే, ముందుగా సేనానాయకుడికి వార్త వచ్చి తీరుతుందే! క్రూర మృగాలను పట్టి పెంపకం చేస్తూ, రాజధానీ నగరంలో సుఖంగా కాలక్షేపం చేసే నీకు, ఒకవేళ అలాంటి శత్రు ప్రమాదం వున్నా ముందుగా ఎలా తెలిసింది?" అని అడిగాడు.

జంతు ప్రదర్శనశాలాధికారి మంత్రికి మరొకసారి నమస్కారం చేసి వణుకుతున్న గొంతుతో, "మంత్రిగారు మరోసారి క్షమించాలి. నేను జంతు ప్రదర్శనశాలకు పశు పక్ష్యాదుల్ని పట్టుకు వచ్చేందుకు కొందరు సైనికులతో మన రాజ్యపుటుత్తర దిశలోని అడవుల్లోకి వెళ్ళాను. అక్కడ సమరబాహు అనే కొండకోటనగర రాజు సైనికులు ఒంటెల మీద పెద్ద దండుగా వచ్చి మా మీద పడ్డారు. మేము వాళ్ళందర్నీ వీరోచితంగా ఎదుర్కొని చాలా మందిని మా వాడి కత్తులకు ఎరచేశాం. కాని అంతలో మరొక ఒంటెల దండు మా మీదికి వచ్చి పడింది. మేము మరింత వీరోచితంగా వాళ్ళను ఎదిరించి, శత్రువులను ఊచకోత కోయసాగాం. మన సైనికుల్లో కొందరు గాయపడ్డారు, కొందరి కత్తులు శత్రువులను నరికీ నరికీ పదును పోయి, బండబారాయి. అయినా రాజభక్తి. దేశభక్తీ మా కిచ్చిన శక్తి సాహసాలతో మరికొందరు శత్రువులను హతం చేశాం. అలా హతం చేస్తూ మనవాళ్ళు అందరూ వీరోచితంగా నేలకొరిగారు. నేనూ, ఈ సైనికుడూ యీ వార్త తమకు తెలిపేందుకు శత్రువ్యూహాన్ని ఛేదించుకుని నగరం చేరాం. ఆ తొందరలో రాజభవన ప్రాంగణంలోకి గుర్రాలతో వచ్చాం," అన్నాడు.

గుక్క తిప్పుకోకుండా జంతు ప్రదర్శన శాలాధికారి చెప్పిందంతా విని, రాజూ, మంత్రీ కూడా అరణ్యంలో ఎవరో బల వంతుడైన శత్రువే చేరాడనీ, ఏదో సమయం చూసుకుని ఆ శత్రురాజు రాజధానీ నగ రాన్ని ముట్టడించగలడనీ భయపడ్డారు.

రాజు వీరసింహుడు రెండు మూడు క్షణాల కాలం తలపంచుకుని ఆలోచించి, మంత్రితో, "మహామంత్రీ! మన మృగాధి కారి తెచ్చిన వర్తమానాన్ని బట్టి, మన రాజ్యపుటుత్తర సరిహద్దు ప్రాంతాల బల మైన శత్రువే చేరి వున్నట్టు తెలుస్తున్నది. సేనాని కోసం కబురంపండి." అన్నాడు.

మంత్రి, ఒక నౌకరును సేనాని కోసం పంపి, జంతు ప్రదర్శనశాలాధికారినీ, సైని కున్నీ గుచ్చి గుచ్చి పరీక్షగా చూస్తూ, "నీ పని మృగాలను పట్టి మచ్చిక చేయటం గదా? నీ మాటలను బట్టి చూస్తుంటే, అరణ్యంలో నువ్వు ఆరితేరిన ఖడ్గయోధు డుగా శత్రువులతో పోరినట్టు కనబడు తున్నది!" అన్నాడు.

"మహా మంత్రిగారు క్షమించి, వినాలి! నా వృత్తిలో నేను అరణ్యంలో సింహాల తోనూ, పులులతోనూ ఒకోసారి బాహాబాహి పోరాడవలసి కూడా వస్తుంది. అలాంటి క్రూరమృగాలతో చెలగాటాలాడే నాకు శత్రువులతో కత్తియుద్ధం చేయటం ఒక



లెక్కలోనిది కాదుగదా?" అన్నాడు జంతు ప్రదర్శనశాలాధికారి.

మంత్రికి యింకా అతడు చెప్పినదాంట్లో పూర్తి నమ్మకం కుదరలేదు. అతడు జంతు ప్రదర్శనశాలాధికారిని కొంచెం దగ్గిరకు రమ్మని, గుండ్రంగా ఓసారి తిరగ మని ఆజ్ఞాపించాడు. అతడు అలా తిరిగే టప్పుడు మంత్రి జంతు ప్రదర్శనశాలాధి కారి శరీరం మీద చిన్న గాయంగాని లేక కత్తి దెబ్బకు దుస్తుల్లో ఎక్కడైనా చిరుగు గాని వుంటుందేమో అని పరీక్షగా చూశాడు. కాని అలాంటి వేమీ మంత్రి కంట బడలేదు.

మంత్రి తలాడిస్తూ చిన్నగా దగ్గి రాజుతో, "మహారాజా! మన దేశంలోని అరణ్యా



ప్రాంతాలకు ఒంటెలను వాహనాలుగా వాడే కొత్త తండా ఒకటి వచ్చినట్టు మాత్రం ఇతడి మాటలవల్ల తెలుస్తున్నది. ఇక పోతే అక్కడ జరిగిందని చెప్పే ఇతడి యుద్ధ వర్ణన అంతా........"

మంత్రి మాట ముగించే లోపల సేనానాయకుడు ఒరలోని కత్తిని టకటకలాడించుకుంటూ అక్కడికి వచ్చి, రాజుకూ, మంత్రికీ నమస్కరించి నిలబడ్డాడు. మంత్రి అతడికి జంతు ప్రదర్శనశాలాధికారి చెప్పిందంతా వివరించి, "ఇంత శత్రు బలగం రాజ్యంలో ప్రవేశించి తిష్ఠవేసివున్న సంగతి సేనానికి తెలియక పోవటం ఆశ్చర్యంగా వుంది!" అన్నాడు.

సేనాని, మంత్రి అన్న చివరి మాటకు గతుక్కుమని, జంతు ప్రదర్శనశాలాధికారి కేసి ఒక కోరచూపు చూసి, రాజునూ, మంత్రినీ ఉద్దేశించి, "ప్రభువులు విన్న దాంట్లో కొంత నిజంవున్నా, ఇతడు కాస్తంత దాన్ని గంపంత చేసి చెబుతున్నాడని నా దృఢ విశ్వాసం. ఆ ఒంటెల మీద అరణ్య ప్రాంతాల తిరిగే వాళ్ళను గురించి లోగడే మన వేగుల ద్వారా కొంత విన్నాను. వాళ్ళను గురించి పూర్తి సమాచారం సేకరించుకు రమ్మని కొందరు వేగుల వాళ్ళను పంపాను. వాళ్ళ నాయకుడు ఆ ప్రాంతాల గల అందమైన ఆటవిక జాతి కన్య నొకదాన్ని పెళ్ళాడి, వాళ్ళతో కలిసిపోవటంతో—పూర్తి సమాచారం సంపాదించటం కొంత ఆలస్యమైంది," అన్నాడు.

"ఆ ఆలస్యాన్ని శత్రువులు బాగా ఉపయోగించు కున్నట్టున్నది!" అన్నాడు మంత్రి కోపంగా. "ఇప్పటికైనా మించి పోయిందేం లేదనుకుంటాను. వేగుల వాళ్ళను ఎన్నుకునేటప్పుడు వాళ్ళకు పెళ్ళాం బిడ్డలున్నారో లేదో తెలుసుకోవటం ముఖ్యం. బ్రహ్మచారుల్ని వేగులవాళ్ళుగా పంపితే ఏం జరుగుతుందో అనుభవం అయింది గదా?" అన్నాడు.

"సేనానీ!" అన్నాడు రాజు చిరాగ్గా మీసం దువ్వుకుంటూ. "ఇంకా కాల

యాపన ఎందుకు? ఆ శత్రుముఠాకు సమరబాహు అనే రాజున్నాడట! కొండ కోట అనే నగరం కూడా కట్టాడట! నువ్వు వెంటనే సైన్యాలతో పోయి ఆ కోటను నేల మట్టం చేసి, వాళ్ళ రాజును సజీవంగా పట్టుకు రావలసిందిగా ఆజ్ఞాపిస్తున్నాను." అన్నాడు.

"చిత్తం, మహారాజా!" అని సేనాని రాజుకూ, మంత్రికీ నమస్కరించి హడా విడిగా పోయి, నూరుమంది గుర్రపు రౌతు లనూ, రెండువందల కాల్బలాన్నీ వెంట బెట్టుకుని, సమరబాహు అనుచరులు కోట కడుతున్న ప్రదేశానికి బయలుదేరాడు.

సమరబాహు ఎలుగ్గొడ్డు ముఠావాళ్ళకు బందీగా చిక్కిన నాటినుంచీ స్వర్ణాచారే అతడి అనుచరు లందరికీ నాయకుడుగా వ్యవహరిస్తున్నాడు. అరణ్యంలో వేటకు పోయిన తనవాళ్ళు ఆటవికుల్నీ, బోనుల్లో వున్న క్రూర మృగాలనూ వెంటబెట్టుకు తిరిగివచ్చి, జరిగిన సంగతి చెప్పగానే, స్వర్ణాచారి నిర్మాణ దశలోవున్న కొండ కోటను రక్షించేందుకు అవసరం అయిన జాగ్రత్తలన్నీ తీసుకోసాగాడు. అతడికి ఖడ్గ జీవదత్తుల శక్తి సామర్థ్యాలలో పూర్తి విశ్వాసం వున్నది. వాళ్ళు సమరబాహును, ఎలుగ్గొడ్డు వాళ్ళనుంచి విడిపించి, ఏ క్షణా న్నయినా కొండకోటకు తీసుకురావచ్చు! ఒక వేళ వీరపురరాజు చేయబోయే దాడికి తాను భయపడి కోట విడిచి పారిపోతే, ఖడ్గజీవదత్తులకు తమ ఉనికి తెలుసుకో



పటం కష్టసాధ్యం అవుతుంది. తాను బాధ్యతారహితంగా ప్రవర్తించిన వాడవుతాడు.

స్వర్ణాచారి ఇలా ఆలోచించి కోటరక్షణకు ఏర్పాట్లు చేస్తూనే, అపజయం ప్రాప్తిస్తే పారిపోయేందుకు వీలుగా, కొండలోవున్న ఒకటి రెండు సొరంగ మార్గాలను ఎన్నుకుని తగిన జాగ్రత్తలో వున్నాడు. ఆటవికులకు తినుబండారాలూ, కొంత ధనం యిచ్చి, వాళ్ళను కొండ ఎక్కి వచ్చేందుకు సులువైన మార్గం వున్నచోట, ఒక గుహలో దాగివుండ మన్నాడు. బోనుల్లో వున్న సింహం, రెండు పులులూ వాళ్ళ అధీనంలో వున్నవి. శత్రువు కోట మీదికి ఆ మార్గాన వచ్చే సమయంలో వాళ్ళు సింహాన్నీ, పులులనూ బోనుల్లో నుంచి వాళ్ళమీదికి వదలాలి. అప్పుడు శత్రుసైనికుల్లో చెలరేగే గందరగోళాన్ని అవకాశంగా తీసుకుని వాళ్ళు అరణ్యంలోకి పారిపోవచ్చు లేదా సమరబాహు అనుచరులకు సాయంచేసి, అతడి వల్ల మరికొన్ని అమూల్యమైన బహుమానాలు పొందవచ్చు....

స్వర్ణాచారి కోటరక్షణకు సన్నద్ధంగా వున్న దశలో, ఒక నాటి సూర్యోదయం వేళ వీరపుర సైన్యం దాడివస్తున్నట్టు, అరణ్యంలో కాపలావున్న సమరబాహు అనుచరుల ద్వారా వార్త అందింది. స్వర్ణాచారి తనవాళ్ళకు ఈటెలూ, వడిసెలలూ యిచ్చి, కొండ కిందికి శత్రువులు రాగానే, ఎలాంటి హెచ్చరికా లేకుండా విసరమన్నాడు.

వీరపుర సేనాని అశ్వికులతో, కాల్బల సైనికులతో కొండ కిందికివచ్చి, కత్తిదూసి పైనున్న సమరబాహు అనుచరుల కేసి చూసి గొంతెత్తి, "ఒరే, నేను వీరపురరాజ్య సేనానాయకుణ్ణి! మీరంతా ఆయుధాలు కింద పడవేసి లొంగిపోయారో సరి, లేకపోతే చిత్రవధ చేస్తాను!" అన్నాడు.

ఆ వెంటనే కొండమీద వున్న సమరబాహు అనుచరులు ఒక్కుమ్మడిగా ఈటెలను వీరపుర సైనికుల మీదికి విసిరారు. వాటిల్లో ఒకటి వేగంగా వచ్చి వీరపుర సేనాని భుజంలో బలంగా గుచ్చుకున్నది.

—(ఇంకావుంది)





# వాగ్దాన భంగం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఎవరికన్నా మాట ఇచ్చి, వాగ్దానభంగానికి వెరిచి ఇలా శ్రమపడుతున్నావేమో తెలియదు. కాని విధి లేని పరిస్థితులలో మాట తప్ప వచ్చు. అందుకు నిదర్శనంగా నీకు మగధ రాజైన వీరసింహుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

వీరసింహుడు యువరాజుగా ఉండగా అప్పుడప్పుడూ అరణ్యంలో వేటకు వెళ్లుతూ ఉండేవాడు. ఒకనాడు అతను వేటాడి, దాహం తీర్చుకోవటానికి ఒక కొలను వద్దకు వెళ్ళాడు. అక్కడ అతనికి ఒక ఆటవిక స్త్రీ కొలనులో స్నానం చేస్తూ కనిపించింది.

## బేతాళ కథలు



అసాధారణమైన ఆమె అందం చూసి వీరసింహుడు మోహపరవశుడై, "నువు అరణ్యవాసానికి తగవు. నా వెంట వచ్చి, నన్ను పెళ్ళాడి, నా అంతఃపురంలో సమస్త సుఖాలూ అనుభవించు," అన్నాడు.

"నాకు పుట్టబోయే కొడుకు నీ అనంతరం రాజు అయేటట్టుంటే నిన్ను పెళ్ళాడతాను," అన్నది ఆమె.

అందుకు ఒప్పుకుని వీరసింహుడు ఆమెను తన వెంట తీసుకుపోయి పెళ్ళాడి, ఆమె తోడిదే లోకంగా కొంతకాలం గడిపాడు.

తరవాత ఒకనాడు అతనికి మళ్ళీ వేట మీద ధ్యాస మళ్ళింది. అతను వేటాడి, ఈ సారి కూడా దాహం తీర్చుకునేటందుకు అదే కొలనుకు వెళ్ళాడు. అక్కడ మళ్ళీ అతనికి మరొక ఆటవిక స్త్రీ స్నానం చేస్తూ కనిపించింది. ఈమె మరింత అందంగా ఉన్నది. ఆమెను చూసి వీరసింహుడు మరొకసారి మోహావేశం చెంది, ఆమెను తన భార్య కమ్మని కోరాడు.

ఈమె కూడా, మొదటి స్త్రీ అడిగినట్టే, తనకు పుట్టబోయే కొడుకు వీరసింహుడి అనంతరం రాజు కావాలని కోరింది. అలాగే చేస్తానని ఆమెకు కూడా మాట ఇచ్చి, ఆమెను తన వెంట తెచ్చుకుని పెళ్ళాడి, తన రెండవ భార్య చేసుకున్నాడు.

మరి కొంత కాలం గడిచింది. వీరసింహుడు మళ్ళీ వేటకు వెళ్ళి తిరిగి వస్తూ, అదే కొలనులో స్నానం చేస్తున్న మూడో ఆటవిక కన్యను చూశాడు. ఈమె ముందు చూసిన ఇద్దరి కన్న కూడా అందంగా ఉన్నది. అతను మనసు పట్టలేక ఆమెను కూడా తన భార్య కమ్మని అడిగాడు. తనకు పుట్టబోయే కొడుకు అతని అనంతరం రాజు అయే షరతు మీద ఆమె అతనికి మూడో భార్య కావటానికి ఒప్పుకున్నది. వీరసింహుడు ఆమెను కూడా పెళ్ళాడాడు.

ఆ తరవాత వీరసింహుడు వేటకు వెళ్ళి తిరిగి వస్తూ, ఆ కొలను గట్టుమీద విచారంగా కూర్చుని ఉన్న మరొక ఆటవిక

స్త్రీని చూశాడు. అయితే అతను ఈమెను చూసి మోహించటం గాని, తనకు భార్య కమ్మని అడగటం గాని చెయ్యక, "నువు ఎవరు?" అని అడిగాడు.

"మా అక్కలు ముగ్గురూ ఒకరి తర వాత ఒకరు నాతో చెప్పకుండా ఎటో వెళ్ళిపోయి, నన్ను ఇక్కడ ఒంటరిగా వదిలేశారు." అన్నదామె.

తన భార్యలే ఈమెకు అక్కలై ఉండా లని ఊహించి, వీరసింహుడు ఆమెను తన వెంట తీసుకు పోయి, తన భార్యలకు చెల్లెలైన ఆమెను తన నాలుగో భార్యగా చేసుకున్నాడు.



ఇది జరిగిన అనంతరం వీరసింహుడికి రాజ్యాభిషేకం జరిగింది. అతని నలుగురు భార్యలూ నలుగురు కుమారులను కన్నారు.

నలుగురు కొడుకులూ అక్క చెల్లెళ్ళ బిడ్డలే అయినా, నాలుగోవాడు ప్రతిదాని లోనూ తన అన్నలకు భిన్నంగా ఉండే వాడు. వాడు తండ్రికి కూడా పెడ పెడగానే ఉండేవాడు. వాడు చీటికీ మాటికీ అడవికి వెళ్ళి, అక్కడ తన జాతివాళ్ళ దగ్గిర కాలం గడిపేవాడు.

పెద్దవాళ్ళు ముగ్గురూ అస్తమానమూ తండ్రిని అంటిపెట్టుకు తిరుగుతూ, ఆయనకు సమస్తమైన ఉపచారాలూ చేసే వారు. వారిలో ఎవరో ఒకడు కాబోయే రాజనే ఉద్దేశంతో మంత్రి కూడా అవకాశం దొరికినప్పుడల్లా అలా చేయమనీ, ఇలా చేయమనీ చెప్పేవాడు. నాలుగో వాడు మాత్రం రాజు చెప్పిన పనికూడా తాను చెయ్యక, మరొకరిని నియోగించేవాడు.

ఇంతలో ఒక వింత విషయం బయట పడింది. నాలుగోవాణ్ణి అరణ్యంలోని ఆటవి కులు తమ నాయకుడుగా ఎన్నుకుని, వాణ్ణి తమ అరణ్యానికి రాజును చేశారు.

రాజుకు వయసు మళ్ళుతున్నది. యువ రాజును నిర్ణయించి, కొంత రాజ్యభారం అతడికి అప్పగించ వలసిన సమయం వచ్చిందని మంత్రి వీరసింహుణ్ణి హెచ్చ రించాడు. వీరసింహుడు అరణ్యానికి వెళ్ళి,

తన నాలుగో కొడుకును తెచ్చి, వాణ్ణి యువరాజుగా అభిషేకించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, వీరసింహుడు తన ముగ్గురు భార్యలకూ చేసిన వాగ్దానం ఎందుకు భంగం చేశాడు? మాట తప్పినవాడు, తన మీద ఎంతో అభిమానంతోనూ, భక్తి విశ్వాసాలతోనూ ఉండే పెద్ద కొడుకులు ముగ్గురిలోనూ ఒకడికి యౌవరాజ్య పట్టాభిషేకం చెయ్యక, తన మీద ఏ మాత్రమూ లక్ష్యంలేని నాలుగో వాణ్ణి తెచ్చి వాణ్ణి యువరాజుగా ఎందుకు అభిషేకించాడు? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "తన నాలుగో కొడుకును యువరాజుగా నిర్ణయించటంలో వీరసింహుడు కొత్తగా మాట తప్పినదేమీ లేదు. ఎప్పుడైతే తన ముగ్గురు రాణులకూ ఒకే వాగ్దానం చేశాడో అప్పుడే అతని మాటకు విలువ లేకుండా పోయింది. ఆ వాగ్దానాలు మోహావేశంలో చేసినవి; మీదు మిక్కిలి అనాగరిక ఆటవిక స్త్రీలకు చేసినవి. వాళ్ళు రాజకుమార్తెలై ఉంటే వీరసింహుడు, అలా ముందూ వెనకా చూడకుండా, శుష్క వాగ్దానాలు చేసి ఉండేవాడు కాడు. తన పెద్ద భార్యల కొడుకులు రాజ్యార్హత లేనివాళ్ళు. వాళ్ళ మనస్తత్వం దాస్యం చేసేవారి మనస్తత్వం. రాజు చెప్పిన పనులూ, మంత్రి చెప్పిన పనులూ ఆలోచించకుండా చేసేవాళ్ళు. నాలుగోవాడు రాజసం గలవాడు. తనకు తండ్రే ఒక పని చెప్పినా, అది చేయటానికి అర్హుడెవరో ఆలోచించి ఆ పనిని వాడికి అప్పజెప్పేవాడు. వాడు స్వతంత్ర బుద్ధీ, స్వతంత్ర ఆలోచనలూ గలవాడు. వాడిలో రాజ్యార్హత చూసే ఆటవికులు వాణ్ణి అడవికి రాజును చేసుకున్నారు. అందుచేత వీరసింహుడు వాణ్ణి యువరాజును చెయ్యటంలో పొరపాటు ఏమీలేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# చెల్లు

ఒక ఊళ్ళో రామయ్య అనే అమాయకుడు ఉండేవాడు. ఒకసారి అతనికి అవసరంగా అయిదు వందల రూపాయలు కావలిసి వచ్చింది. ఊరంతా తిరిగి నిస్పృహచెంది ఇంటికి వస్తూ, దారిలో గుడి తగిలితే, లోపలికి వెళ్ళి, చివరి ప్రయత్నంగా దేవుణ్ణి ప్రార్థించి, "స్వామీ, ఇవాళ నాకు ఎంత దొరికినా అందులో సగం నీకిస్తాను," అని అనేశాడు.

చాలా చిత్రంగా, ఆ రోజు అతను తన పొలంలో పనిచేసుకుంటూ ఉంటే ఏనాటిదో ఒక సంచీ దొరికింది. అందులో వెయ్యి రూపాయ లున్నాయి. రామయ్య ఎంతో సంతోషించి, ఆ డబ్బుతెచ్చి భార్యకిచ్చి, తన దేవుడి మొక్కు సంగతి చెప్పాడు.

"గుడి ధర్మకర్త అంతా స్వాహాచేస్తాడు. అందుచేత దేవుడి పేరుచెప్పి బీదలకు సంతర్పణ చెయ్యటం మంచిది," అని రామయ్య భార్య సలహా ఇచ్చింది. రామయ్య వెంటనే గ్రామాధికారి దగ్గిరికి వెళ్ళి, జరిగినదంతా చెప్పి, తాను బీదలకు సంతర్పణ చెయ్యబోతున్నా నన్నాడు. గ్రామాధికారి ఎంతో సంతోషించి, మర్నాడు బీదలకు సంతర్పణ జరుగుతుందని చాటింపు వేయించాడు.

గుడి ధర్మకర్త రామయ్య మొక్కుకున్న సంగతి పూజారి ద్వారా విని ఉన్నాడు. ఆ రామయ్యే బీదలకు సంతర్పణ చేస్తున్నాడంటే ఆయనకు అనుమానం కలిగింది. ఆయన గ్రామాధికారి దగ్గిరికి వచ్చి, "సంగతి ఏమిటి?" అని అడిగాడు. గ్రామాధికారి రామయ్యకు వెయ్యి రూపాయలు దొరికిన సంగతి చెప్పాడు.

"రామయ్య దేవాలయానికి సగం ఇస్తానని మొక్కుకున్నందు వల్లనే ఆ డబ్బు దొరికింది. న్యాయంగా అందులో సగం

యండమూరి వీరేంద్రనాథ్

ఆలయానికి చెందాలి. ఆ డబ్బును అతను ఇలా ఖర్చు చెయ్యటం అక్రమం," అని ధర్మకర్త పేచీపెట్టాడు.

ధర్మకర్త డబ్బు తినటంలో అఖండుడని గ్రామాధికారికి తెలుసు. కాని, ఆయన చెప్పేది సబబుగానే ఉన్నట్టు కనబడింది. అందుచేత గ్రామాధికారి రామయ్యను పిలిపించి, అయిదు వందలు ఆలయానికి ఇవ్వమని తీర్పు చెప్పాడు.

రామయ్య విచారంగా ఇంటికి వెళ్ళాడు. ఏం జరిగిందని భార్య అడిగింది. రామయ్య ఆమెకు జరిగినది చెప్పి, "బీదవాళ్ళకు సంతర్పణ చెయ్యటం ఏ పరిస్థితిలోనూ మానను. మిగిలిన అయిదు వందలూ ఆలయానికి ఇచ్చేస్తాను," అన్నాడు.

రామయ్య భార్యకు హఠాత్తుగా ఒక ఆలోచన వచ్చింది. ఆమె దాన్ని తన భర్తకు రహస్యంగా చెప్పింది.

మర్నాడు ఆ గ్రామంలో పేదలకు బ్రహ్మాండమైన సంతర్పణ జరిగింది. కాని రామయ్య ధర్మకర్తకు అయిదు వందలూ తెచ్చి ఇయ్యలేదు. ఒళ్ళు మండి ధర్మకర్త గ్రామాధికారి వద్దకు వచ్చి రామయ్య మీద ఫిర్యాదుచేశాడు. గ్రామాధికారి రామయ్యను పిలిపించి సంజాయిషీ అడిగాడు.

రామయ్య చేతులు జోడించి, "దేవుడి డబ్బు ఉంచుకుంటానండీ? ఇవ్వాలనే అనుకున్నాను...." అని ఆగాడు.

"మరి ఇంకెందుకు ఆలస్యం?" అన్నాడు ధర్మకర్త కోపంగా.

"డబ్బు ఇద్దామనే, మర్నాడు మళ్ళీ గుడికివెళ్ళి, ఇంకో వెయ్యి రూపాయలు దొరికేటట్టు చెయ్యమనీ, అందులో కూడా సగం ఇస్తాననీ మొక్కుకున్నానండి. మొత్తం వెయ్యీ దేవుడికే ఇచ్చేద్దాం గదా అనుకున్నానండి. కాని ఆ రోజు నాకు ఏమీ దొరకలేదండి. నేను మొక్కుకున్న వెయ్యి రూపాయలూ దేవుడిదే కదా, దాన్ని ఆయనే ఉంచేసుకుని, నా బాకీ చెల్లు బెట్టుకున్నాడు అనుకున్నానండి," అన్నాడు రామయ్య.

గ్రామాధికారి నవ్వి, ధర్మకర్త చేసిన ఫిర్యాదు కొట్టిపారేశాడు.



# బావీ, నీరూ

ఆదెయ్యకు అనే రైతుకు ఒక మోటబావి ఉండేది. అతను చాలా బీదవాడు కావటం చేత అవసరానికి ఆ బావిని అమ్మజూపాడు. వీరప్ప అనే మరొక రైతు బేరమాడి, ఆ బావిని ఆరువందల రూపాయలకు కొనుక్కున్నాడు.

కొంత కాలం గడిచినాక ఆదెయ్య కొంత మెట్టపొలం సంపాదించు కున్నాడు. అతనికి మోటబావి నీరు కావలిసి వచ్చింది. అతను వీరప్ప వద్దకు వెళ్ళి, "నీ డబ్బు నీకు ఇచ్చేస్తాను, నా బావి నాకు తిరిగి ఇచ్చెయ్యి," అని అడిగాడు.

"నువు రెట్టింపు డబ్బు ఇచ్చేదిగాక, నేను కొనుక్కున్న బావిని తిరిగి ఇవ్వను," అన్నాడు వీరప్ప.

ఆదెయ్యకు కోపంవచ్చి, మునసబు దగ్గిరికి వెళ్ళి చెప్పుకున్నాడు. మునసబు వీరప్పను పిలిపించి అడిగితే అతను మళ్ళీ అదేమాట చెప్పాడు.

అప్పుడు ఆదెయ్య, "నేను వీరప్పకు బావి అమ్మానుగాని, అందులో నీళ్ళు అమ్మలేదు. ఆ నీరు నాదే!" అన్నాడు.

ఈ మాట విని వీరప్ప మునసబుతో, "అలా అయితే నా బావి నుంచి తన నీరంతా తోడుకు పొమ్మనండి. తోడుకు పోలేకపోతే నా బావిలో తన నీరు ఉంచినందుకు నెలకు పదిహేను రూపాయల అద్దె కట్టుకోవలిసి ఉంటుంది," అన్నాడు.

దానితో ఆదెయ్య ఆటకట్టింది.

—ఎస్. సుబ్బారావు





# మీ తప్పులోనే తప్పు

చాలా కాలం క్రితం కాంచీపురంలో ఇంద్ర భూపతి అనే జైనముని ఉండేవాడు. ఆయన దర్శనం చేసుకోవటానికి వస్తూ ఇద్దరు జైనసన్యాసులు మధ్యాహ్నం వేళ ఒక భవనంలో విశ్రాంతి తీసుకున్నారు.

వాళ్ళు తమ వెంట ఉన్న ఆహారపు మూటలు తీశారు. ఆహారం వాసన పసి కట్టి ఒక కుక్క తోక ఆడించుకుంటూ వారి వద్దకు వచ్చింది. వారిలో ఒకడు కుక్కను చూసి జాలిపడి, తన మూట విప్పి, అందులో నుంచి కొంత ఆహారం కుక్కకు వేశాడు.

తరవాత వాళ్ళు నీరు తీసుకు రావటానికి చెంబులు తీసుకుని పోతూ, తమ ఆహారపు మూటలను ఒక చెట్టు తొర్రలో పెట్టారు. వాళ్ళు తిరిగి వచ్చేసరికి కుక్క అదివరకే విప్పి ఉన్న మూటను కిందికి లాగి మిగిలిన ఆహారం కూడా తినేస్తున్నది.

ఆ మూట గలవాడు అసలే ఆకలిమీద ఉండటం చేత ఆగ్రహం వచ్చి, తన నీళ్ళ చెంబును కుక్క మీదికి విసిరాడు. అది దెబ్బతిని అరుస్తూ పారిపోయింది.

"కుక్క కృతజ్ఞత గల జంతువన్నది అబద్ధం. నేను దాన్ని జాలిదలిచి ఆహారం పెడితే అది నా మూటలోనే మూతి పెట్టింది. దాన్ని చంపినా పాపం లేదు," అన్నాడు ఆహారం పోగొట్టుకున్నవాడు.

దానికి రెండోవాడు, "ఇప్పుడు జరిగిన దాన్ని బట్టి కుక్క కృతజ్ఞతలేని జంతువని చెప్పటానికి లేదు. మనమే తప్పు చేశామని నాకు తోస్తున్నది. మన మూటలను మనం దానికి అందేలాగు పెట్టాం. జ్ఞానం గల మనుషులే తప్పు పనులు చేస్తూంటే మంచి చెడ్డల విచక్షణ తెలియని కుక్క తప్పు చేసిందని కొట్టటం న్యాయం కాదు," అన్నాడు రెండోవాడు.

సి. ఆనందరావు




"అది చేసిన తప్పుకు సరి అయిన దండనే ఇచ్చాను," అన్నాడు మొదటివాడు.

"కుక్కదే తప్పనటం నందివర్మ తీర్పులాగుంది," అన్నాడు రెండోవాడు.

"ఎవరా నందివర్మ? ఏమిటి అతని తీర్పు?" అని మొదటివాడు అడిగాడు.

రెండోవాడు తన ఆహారంలో సగం మొదటి వాడికి పంచి ఇస్తూ, నందివర్మ కథ ఇలా చెప్పాడు:

నందివర్మ అనే రాజు కాంచీపురాన్ని న్యాయంగా పాలిస్తూ, అవినీతిగా నడిచిన వారిని విచారించి, తగిన దండనలు ఇచ్చేవాడు. న్యాయమైన తీర్పు ఇవ్వటంలో తనకు తానే సాటి అన్న అహంకారం కూడా ఆయనకు కాస్త ఉండేది.

ఒకసారి ఇంద్రభూపతిముని రాజును ఆశీర్వదించి పోదామని రాజసభకు వచ్చాడు. ఆ సమయంలో ఆ రాజు ఒక దొంగను విచారణ చేస్తున్నాడు. ఆ దొంగ ఒక వర్తకుడి ఇంట దొంగతనం చేశాడు. నేరం రుజువయింది. నందివర్మ ఆ దొంగకు యావజ్జీవకారాగారశిక్ష విధించి, "నా తీర్పు ఎలా ఉన్నది?" అని ఇంద్రభూపతి మునిని అడిగాడు.

"ఈ తీర్పులో నాకు న్యాయ సూక్ష్మం ఏమీ కనిపించలేదు. దొంగ దొంగతనం చేసి, శిక్షింపబడ్డాడు. అది రాజశాసనం. ఇదంతా మామూలుగా జరుగుతున్నదే. ఈ శాసనం వల్లా, శిక్ష వల్లా దొంగతనాలు నిలిచిపోవుగదా! ధర్మసూక్ష్మం విచారించి నట్టయితే దొంగతోబాటు వర్తకుడూ, రాజువైన నువూ కూడా శిక్షార్హులే. కాని ఈ ప్రపంచంలో ధర్మసూక్ష్మం ఆలోచించే వాడెవడు?" అంటూ ఇంద్రభూపతిముని నిట్టూర్చాడు.

ఈ మాట వినగానే రాజు ముఖం చిన్నబోయింది. వర్తకుడికి కూడా తన అపరాధం ఏమిటో తెలుసుకోవాలనిపించింది గాని మునిని అడగటానికి ధైర్యం చాలలేదు.

ఇంతలో ఇంద్రభూపతిమునే ఇలా అన్నాడు:

"సకల శాస్త్రాలూ చదివి, ధర్మాలన్నీ తెలిసిన సోమదత్తు డనే బ్రాహ్మణశ్రేష్ఠుడే దేవస్వాన్ని దొంగిలించాడే, దాని ముందు ఈ దొంగతనం ఏ పాటి?"

సోమదత్తుడి వృత్తాంతం వినాలని రాజు కోరగా ముని ఇలా చెప్పాడు:

ఒకసారి జైనుల ప్రత్యక్షదైవం లాంటి వర్థమానుడు అడవిలో తపస్సు చేస్తూండగా, దేవేంద్రుడు ఆయనను గౌరవించ దలచి రెండు జతల దేవతావస్త్రాలు ఇచ్చాడు. ఒక్కొక్క జత వస్త్రాలలోనూ ఒకటి కట్టుకోవటానికీ, ఒకటి పైన కప్పుకోవటానికీ. వర్థమానుడు ఒక జత వస్త్రాలు ధరించి, రెండో జత దగ్గిర ఉంచుకున్నాడు.

ఆ సమయంలో సోమదత్తు డనే మహా విద్వాంసుడు అటుగా ప్రయాణం చేస్తూ వర్థమానుణ్ణి దర్శించి, దేవతావస్త్రాల కేసి ఆశగా చూసి, "నా కొక వస్త్రం దానం చెయ్యరాదా?" అని అడిగాడు.

వర్థమానుడు తాను ధరించని జతలో నుంచి ఒక వస్త్రాన్ని సోమదత్తుడికి ఇచ్చేశాడు. దానితో సోమదత్తుడు తృప్తిపడక, వర్థమానుడు ధ్యాననిష్ఠలో ఉన్న సమయంలో రెండవ వస్త్రాన్ని కూడా దొంగిలించి, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

వర్థమానుడు తరవాత కళ్ళు తెరిచి, జరిగిన సంగతి గ్రహించి, "సోమదత్తుడు అడిగినప్పుడు నేను రెండూ ఇచ్చి ఉండవలసింది. ఆయన దొంగతనం చెయ్యటానికి నేనే గదా కారకుణ్ణి అయాను! ఒకరి దగ్గిర లేని వస్తువును దగ్గిర ఉంచుకోవటం తప్పు." అనుకుని, తాను కట్టుకున్న దేవతావస్త్రాన్ని లంగోటీల కింద చించి, వాటన్నిటినీ తన శిష్యులకు పంచి, తాను కూడా ఒకటి ధరించాడు.

ఈ కథ విని నందివర్మ తన తీర్పులోని అజ్ఞానాన్ని గ్రహించి, సిగ్గుపడి, దొంగను క్షమించి, వాడికి సుఖంగా జరిగేటట్టు సౌకర్యం కలిగించాడు.

ఇదంతా విన్నమీదట మొదటి జైన సన్యాసి తాను కుక్కను దండించినందుకు పశ్చాత్తాపపడ్డాడు.



# నిజమైన కవి

ఒకానొక దేశంలో ఒక ఖాన్ ఉండే వాడు. ఆ దేశంలో అనేక మంది కవిగాయకు లుండే వారు. వాళ్ళు పాటలు కట్టి ఖాన్ సమక్షంలో పాడి, అతన్ని ఆనందపరుస్తూ ఉండే వారు.

ఒకసారి ఖాన్ ఒక పాట విన్నాడు. ఆ పాటలో ఖాన్ క్రూరత్వమూ, అన్యాయమూ నిరసించ బడ్డాయి. ఖాన్ మండిపడి ఆ పాట రాసినవాణ్ణి పట్టితెమ్మని భటులను అజ్ఞాపించాడు. ఎంత వెతికినా ఆ పాట రాసిన కవి దొరకలేదు.

అప్పుడు ఖాన్ తన రాజ్యంలో ఉన్న కవులందరినీ పట్టి తెప్పించి, ఖైదుచేయించి, "నా క్రూరత్వాన్ని, అన్యాయాన్ని గురించి పాట రాసినది మీలో ఎవరు?" అని అడిగాడు. ఎవరూ చెప్పలేదు.

ఖాన్ ఒక్కొక్క కవినీ తాను రాసిన పాట పాడమన్నాడు. ఒక్కొక్కరూ ఖాన్ దయనూ, న్యాయాన్ని కీర్తించుతూ పాట పాడారు. అందరినీ ఖాన్ విడుదల చేశాడు. వారిలో ఒక్కడు మాత్రం పాడ నిరాకరించాడు.

ఆ కవిని రచ్చకూటానికి తెచ్చి, అక్కడ పేర్చి ఉన్న చితిని చూపి, "నువు పాడక పోతే ఈ చితి మీద సజీవంగా దహనమవుతావు," అన్నాడు ఖాన్. అప్పటికి అతను పాడలేదు. అతన్ని కట్టి, చితి మీది కెక్కించి, "ఇప్పటికైనా పాడతావా? చచ్చిపోతావా?" అని ఖాన్ అడిగాడు.

అప్పుడా కవి పాడాడు. ఖాన్ క్రూరత్వాన్ని, అన్యాయాన్ని నిరసించిన పాటే అది. దాన్ని వినగానే ఖాన్, "వాడొక్కడే నిజమైన కవి. చితి నుంచి దించండి," అని కేకపెట్టాడు.







# ఆశకు అంతం

ఒక ఊళ్ళో సుబ్బయ్యశాస్త్రి అనే పురోహిత బ్రాహ్మణుడు ఉండేవాడు. చుట్టుపక్కల గ్రామాలలో కర్మకాండలు ఏవి జరిగినా ఆయననే పిలిచేవాళ్ళు.

పొరుగు గ్రామంలోని కరణంగారింటి వారి కుమార్తె వివాహం జరిగింది. సుబ్బయ్యశాస్త్రి పెళ్ళి పౌరోహిత్యం చేశాడు. పెళ్ళి పూర్తి అయినాక కరణం గారు శాస్త్రికి ఇన్ని భక్ష్యాలు మూట కట్టి ఇచ్చిపంపాడు.

శాస్త్రి నిదానంగా అడవి దారిన నడుచుకుంటూ వస్తూండగా దారిలోనే చీకటి పడింది. అయినా తెలిసిన దారి కావటం చేత శాస్త్రి తిన్నగా నడక సాగించాడు. ఆయన ఒక పెద్ద చింతచెట్టు కిందికి వచ్చే సరికి, అకస్మాత్తుగా ఆయన ఎదట ఒక పిశాచం కనపడి, "సమయానికి వచ్చావు! పొద్దుటి నుంచీ చచ్చే ఆకలి మీద ఉన్నాను. నరమాంసం తిని చాలా కాలమయింది," అన్నది.

శాస్త్రి పిశాచాన్ని చూసి ఏ మాత్రమూ బెదరక, "చచ్చు నరమాంసం కోసం నన్ను చంపి తిన్నావంటే ఇక ఇటుగా ఎవరూ రారు. నా మాంసం కన్న పదింతలు రుచిగా ఉండే తినుబండారాలిస్తాను. అవి నీకు నచ్చుతాయేమో చూడు," అన్నాడు.

"తినుబండారాలా? ఏవీ, చూపించు?" అన్నది పిశాచం.

శాస్త్రి తన మూట విప్పి, "చూడు! ఇవి లడ్డూలు, ఇవి జిలేబీలు, ఇవి పోళీలు. తినిచూడు," అన్నాడు.

పిశాచం, "బాగుంది, బాగుంది," అంటూ భక్ష్యాలన్నీ తినేసి, "ఇంతేనా? ఇంక లేవా?" అని అడిగింది.

"ఇంకా కావాలంటే రేపు తెస్తా. కాని నేను బీద బ్రాహ్మణ్ణి. ఇవి తయారు చెయ్యా

ఆర్. విజయకుమార్

టానికి చాలా సామగ్రి కొనాలి. కొనటానికి నా దగ్గిర డబ్బులేదు," అన్నాడు శాస్త్రి.

"డబ్బు నేనిస్తాగా?" అంటూ పిశాచం చెట్టు తొర్రలో దూరి, మరో నిమిషంలో రెండు చేతుల నిండా బంగారు నాణాలను తెచ్చి, బ్రాహ్మణుడికి ఇచ్చింది. భక్ష్యాల మూట బరువైన బంగారం మూటగా మారిపోయింది.

"రోజూ ఇదే వేళకు ఈ చెట్టు వద్దకు భక్ష్యాలు తెచ్చావంటే ఇలా నీకు బంగారం ఇస్తాను," అని పిశాచం వెళ్ళిపోయింది.

"బతుకు జీవుడా!" అనుకుని శాస్త్రి తన యిష్టదైవాన్ని స్మరించుకుంటూ ఇల్లు చేరుకుని, బంగార మంతా భార్య ముందు పోసి, ఆమెకు జరిగిన దంతా చెప్పాడు.

తన భర్త పిశాచం వాత పడకుండా ప్రాణాలతో ఇల్లు చేరినదే పదివేలు అనుకుని ఆ ఇల్లాలు, "మనం ఈ బంగారంతో రెండు తరాలపాటు హాయిగా బతకవచ్చు. ఇంక చాలులెండి. పిశాచాలను నమ్మరాదు. ఇక ఆ దారిన వెళ్ళకండి," అన్నది.

"ఔనౌను. నువు చెప్పినది నిజం. దొరికిన దానితో తృప్తిపడదాం," అన్నాడు శాస్త్రి.

శాస్త్రి ఇల్లు చేరగానే, విశేషాలు విందామని వచ్చిన పొరుగింటి ఆవిడ బంగారం చూస్తూనే బయటి చీకటిలోనే ఆగిపోయి, భార్యాభర్తల సంభాషణ అంతా విన్నది.



ఆమె చప్పున తన ఇంటికి వెళ్ళి తన భర్తతో తాను విన్నదంతా చెప్పి, "ఆ పిచ్చి బ్రాహ్మడు ఇంక పిశాచం దగ్గిరికి పోడుట. నేను లడ్డూలూ, జిలేబీలూ, పోళీలూ చేసి ఇస్తాను. మీరు రేపు రాత్రి వెళ్ళి వాటిని పిశాచానికి ఇచ్చి, బంగారం పట్టుకు రండి. ఆ విధంగా రోజూ ఇంతింత బంగారం తెచ్చుకోవచ్చు," అన్నది. ఆమె భర్త పరమానందం చెందాడు.

మర్నాడు సాయంకాలం రామయ్య అనే ఆ మనిషి తన భార్యచేత పాతికేసి, పాతికేసి లడ్డూలూ, జిలేబీలూ, పోళీలూ తయారు చేయించి, వాటిని తీసుకుని ఆ రాత్రి పెద్ద చింతచెట్టు వద్దకు వెళ్ళాడు.

అనుకున్న వేళకు పిశాచం వచ్చి, "భక్ష్యాలు తెచ్చావా?" అని రామయ్యను అడిగింది.

రామయ్య తాను తెచ్చిన మూటను విప్పి పిశాచం ముందు పెట్టాడు. పిశాచం భక్ష్యాలన్నీ తిని, రెండు చేతుల నిండా బంగారం తెచ్చి ఇచ్చి, "రోజూ ఇలాగే తీసుకురా. బంగారం ఇస్తూ ఉంటాను," అన్నది.

రామయ్యకు డబ్బుమీద అంతులేని ఆశ ఉన్నప్పటికీ శాస్త్రి అంత ధైర్యంకల వాడు కాడు. పిశాచం కనిపించినది మొదలు అది వెళ్ళిపోయిన దాకా అతని ప్రాణాలు పీచు పీచు మంటూనే ఉన్నాయి. ఆయన బంగారంతో ఇంటికి తిరిగివచ్చి, "ఇది లాభసాటి వ్యాపారమే గాని, రోజూ ఆ పిశాచాన్ని కలుసుకోవట మంటే గుండె దడగానే ఉన్నది సుమా!" అన్నాడు భార్యతో.

రామయ్య భార్య కొంచెం ఆలోచించి, "అవునుగానీ, ఆ పిశాచం చింతచెట్టు తొర్రలో నుంచి గదా బంగారం తెచ్చి ఇస్తున్నదీ? పట్టపగలు వెళ్ళి ఆ తొర్రలో ఉండే బంగార మంతా తెచ్చేను కుంటే మనకా పిశాచంతో పనేలేదుగా?" అన్నది.

ఈ ఆలోచన రామయ్యకు అద్భుతంగా కనిపించింది. ఆయన తెల్లవారు జామునే ఆ చింతచెట్టు వద్దకు ఒక గొడ్డలి తీసుకుని పోయి, తొర్రను పగలగొట్టాడు. చెట్టు పడిపోయింది. తొర్ర అడుగున బొగ్గునుసి తప్ప ఏమీ లేదు. ఈ మాట చెబితే తన భార్య నమ్మదనుకుని రామయ్య ఆ బొగ్గుపొడి ఇంత మూట గట్టుకుని ఇంటికిపోయి, దాన్ని భార్యకు చూపి ఒక మూలకు ఆ పొడిని విసిరివేశాడు.

ఆ పొడి నేల మీద పడగానే దానినుంచి భగ్గున మంటలులేచి, క్షణంలో ఇల్లంతా కాలి బూడిద అయిపోయింది. రామయ్యకున్న సమస్తమూ పోయింది. భార్యాభర్తలిద్దరూ ప్రాణాలతో మాత్రమే బయటపడ గలిగారు. అంతా పోగొట్టుకుని, కట్టుబట్టలతో మిగిలిన ఆ దంపతులకు ఆ ఊళ్ళో ఉండటానికి మొహం చెల్లక, మరో వూరు వెళ్ళిపోయారు.





ఒక గ్రామంలో ఒక పేద వైశ్యకుటుంబం ఉండేది. ఆ కుటుంబంలో వృద్ధులయి పోతున్న భార్యాభర్తలూ, వారి కుమారుడూ ఉండేవారు. ఆ కుటుంబం చిల్లర వ్యాపారం చేసి జీవిస్తూ ఉండేది. కాని రాను రాను ఆ వ్యాపారంతో జీవనం గడపటం కష్టమయింది. అందుచేత యువకుడైన రాముడు పట్నం వెళ్ళి, పెద్ద వ్యాపారస్థుల వద్ద పని నేర్చుకుంటూ, ప్రస్తుతానికి తన పొట్ట తాను పోసుకోవటానికీ, అవకాశం దొరికితే తానే పెద్ద వ్యాపారం ప్రారంభించటానికీ నిశ్చయించాడు. కొడుకు ఆలోచన బాగానే వుందని తల్లిదండ్రులు ఒప్పుకున్నారు.

రాముడు తనకు దారిలో కావలిసిన ఆహారమూ, బట్టలూ, ఇతర వస్తువులూ మూట గట్టుకుని, దూరాన ఉన్న పట్టణానికి బయలుదేరాడు. అతను వెళ్ళే దారిలో ఒక పుణ్యక్షేత్రం ఉన్నది. అక్కడ ఒక కోనేరూ, అమరనాథ దేవాలయమూ ఉన్నాయి. అమరనాథ దేవాలయం వద్ద ఒక పెళ్ళివారి బలగం చేరి ఉన్నది. రాఘవశెట్టి అనే సంపన్న వైశ్యుడు తన కుమార్తె అయిన యశోదను, మరొక పట్టణానికి చెందిన కోటీశ్వరుడి కుమారుడైన జయదేవశెట్టికి ఇచ్చి పెళ్ళి చెయ్యబోతున్నాడు. ఉభయపక్షాల వారూ దేవాలయం దగ్గిర చేరారు. పెళ్ళి ముహూర్తానికి ఇంకా చాలా వ్యవధి ఉన్నది. అందుచేత ఎవరి పనులు వారు చూసుకుంటున్నారు.

రాముడు గుడి వద్ద ఉన్న కోనేరులో స్నానంచేసి, దేవుడికి దణ్ణం పెట్టుకుందామనుకుని, తన మూటను పెట్టే స్థలం కోసం చూశాడు. ఒక చెట్టు కింద అతనికి ఒక వృద్ధురాలు కనిపించింది. ఆమెకు సమీపంలో చాలా మూటలు ఉన్నాయి. అతను

కాళపల్లి తిరుమలేశ్వరగుప్త

ఆమె దగ్గిరికి వెళ్ళి, "అవ్వా, నేను స్నానం చేసి, దేవుడి దర్శనం చేసుకుని వస్తాను. అందాకా ఈ మూటను కాస్త చూస్తూ ఉండు," అని చెప్పి, కోనేట్లో స్నానంచేసి, దేవుడి దర్శనం చేసుకుని, పట్నంలో తన ప్రయత్నాలు ఫలించేటట్టు చెయ్యమని దేవుణ్ణి ప్రార్థించాడు. తరవాత అతను అవ్వ వద్దకు తిరిగివచ్చి, ఆమెనడిగి తన మూట తాను తీసుకుని, తన దారిన తాను బయలుదేరాడు.

రాముడు కొంతదూరం నడిచాక అతనికి ఆకలివేసింది. అతను ఒక చెరువు చూసి, దాని గట్టున ఉన్న చెట్టు కిందికి చేరి, భోజనం చేద్దామని మూట విప్పాడు. కాని అందులో తన భోజనంగాని, బట్టలుగాని లేవు—బంగారు నగలూ, రూపాయలూ ఉన్నాయి! అది పెళ్ళివారి మూట. వృద్ధురాలు పొరబడి ఒక మూటకు బదులు మరొక మూట ఇచ్చింది.

ఈ సంగతి గ్రహించి రాముడు అమరనాథ దేవాలయం దగ్గిరికి తిరిగివచ్చాడు. అతను చేరేలోపుగా పెళ్ళికూతురు తరఫు వారికీ, పెళ్ళికొడుకు తరఫువారికీ మధ్య పెద్ద రంధి సాగింది.

పెళ్ళికూతురు తండ్రి రాఘవశెట్టి నగలు పోయాయంటే పెళ్ళికొడుకు తండ్రి అంతా అబద్ధమనీ, పచ్చిమోసమనీ, ఇటువంటి సంబంధం చేసుకోవటం తమకు పరువు చేటు అనీ, తమకు తీరని అవమానం జరిగిందనీ ఎగిరిపడ్డాడు.



రాఘవశెట్టి తాను నిజమే చెబుతున్నా ననీ, ఇలా పెళ్ళి తప్పిపోతే తన కూతురుని ఎవరూ చేసుకోరనీ, పెళ్ళి అయిన అనంతరం ఇస్తామన్న నగలన్నీ తాను చేయించి ఇస్తాననీ తన వియ్యంకుణ్ణి కాళ్ళా వేళ్ళా పడి బతిమాలాడు.

పెళ్ళికొడుకు తండ్రి ఈ అవమానానికి పరిహారం ఏమీ లేదు పొమ్మన్నాడు.

ఈ ఘట్టం జరుగుతూ ఉండగా రాముడు అక్కడికి వచ్చి, చెట్టు కింద మూటలు పెట్టుకుని కూర్చుండిన అవ్వ ఎక్కడ ఉన్నదని రాఘవశెట్టిని అడిగాడు.

"ఆవిడ నా తల్లే! ఆవిడ నిర్వాహకమే ఈ గొడవంతా తెచ్చి పెట్టింది!" అన్నాడు రాఘవశెట్టి.

"ఇదుగో నండీ, ఆవిడ నా కిచ్చిన మూట! ఇందులో నగలున్నాయి. దీన్ని తీసుకుని నా మూట నా కిప్పించండి," అన్నాడు రాముడు.

వియ్యాల వారి మధ్య రేగిన కలహం మబ్బు విచ్చినట్టు విచ్చింది. రాఘవశెట్టి అబద్ధం ఆడలేదు. పెళ్ళివారికి అన్యాయం జరగలేదు. నగలున్నాయి. పెళ్ళి జరగటానికి ఎలాటి అభ్యంతరమూ ఇక లేదు.

రాఘవశెట్టి రాముణ్ణి యశోదకు చూపి, "ఇతను మన మానం కాపాడాడమ్మా! ఇక నీ పెళ్ళి నిరాటంకంగా జరిగిపోతుంది," అన్నాడు.

యశోద రాముణ్ణి అతని విషయాలన్నీ అడిగి తెలుసుకున్నది.



"బాబూ, మాకు నువు చేసిన సహాయం ఇంతా అంతా కాదు. మా పిల్ల పెళ్ళి పూర్తి అయినదాకా ఉండి మరీ వెళ్ళు," అన్నాడు రాఘవశెట్టి రాముడితో.

రాముడు అందుకు ఒప్పుకుని వారి అతిథిగా ఉండిపోయాడు.

పెళ్ళి తంతు ప్రారంభమయింది. వధూవరులు పెళ్ళి పీటల మీద కూర్చున్నారు. పెళ్ళికూతురు తండ్రి, పెళ్ళికొడుక్కు కట్నం కింద ఇస్తున్న నగలూ, నగదూ ఒక తట్టలో ఉంచి, వధూవరులకు ఎదురుగా పెట్టారు.

మాంగల్యధారణ సమయం వచ్చింది. పెళ్ళికొడుకు జయదేవశెట్టి యశోద మెడలో మంగళ సూత్రం కట్టబోయాడు. యశోద అతనికి నగల తట్ట చూపించి, "మంగళ సూత్రం ఆ తట్టకు కట్టు. నీకు కావలసిన నగలూ, డబ్బూ ఆ తట్టలో ఉన్నాయి. నువు నన్ను పెళ్ళిచేసుకోవటానికి రాలేదు. ఆ నగల కోసమూ, డబ్బుకోసమూ వచ్చావు. మీకు ఎంత డబ్బుండి ఏం లాభం? గుణం లేదు," అని ఎదురుగా ఉన్న రాముణ్ణి చూపి, "అతను బీదవాడు. పొట్ట చేత పట్టుకుని, బతుకు తెరువు కోసం ఉన్న ఊరు విడిచి ఎక్కడికో పోతున్నాడు. కాని పొరపాటున తన చేతికి వచ్చిన సొమ్ము ముడుపులాగా తెచ్చి ఇచ్చాడు. అతనికున్న నీతిలో మీకు వెయ్యో వంతు లేదు. నేను తాళి కట్టించుకుంటే అటువంటి వాడిచేత కట్టించుకుంటాను," అన్నది.

పెళ్ళికొడుకు వారు హాహాకారాలు చేశారు. అదివరకు వారు తమకు జరిగిందనుకున్న అవమానం నిజం కాదు, ఇదే నిజమైన అవమానం. రాఘవశెట్టి కూతురికి చెప్పి చూశాడు, కాని ఆమె రాముణ్ణి తప్ప పెళ్ళాడనని హఠం పట్టింది. రాఘవశెట్టి తరపు బంధువులు కొందరు యశోదను సమర్థించారు. పెళ్ళి ప్రయత్నాలు వృథా పోకుండా రాముడే యశోద మెడలో మూడు ముళ్ళూ వేశాడు. మగ పెళ్ళివారు చిత్తుగా ఓడిపోయిన సేనలాగా తిరుగు ప్రయాణమయారు.





# రాజకుమారి సాహసం

వల్లభపుర రాజైన రంగాదిత్యుడు సంతానం కోసం తపించి, తపించి, ఒక కుమార్తెను కన్నాడు. ఆయన ఆమెకు సుఖలత అని పేరు పెట్టి ఎంతో గారాబంగా పెంచుకో సాగాడు. దివాణంలో అందరికీ ఆమె అంటే పంచప్రాణాలు.

సుఖలత పెరిగి పెద్దదవుతూ సకల శాస్త్రాలతో బాటు యుద్ధవిద్యలు కూడా క్షుణ్ణంగా నేర్చుకున్నది. ఇది రంగాదిత్యుడికి ఏ మాత్రమూ ఇష్టం లేదు. కాని సుఖలత రాజకుమార్తె లాగా కాక, రాజకుమారుడి లాగా తయారు కావాలని పట్టు బట్టింది.

సుఖలత పదిహేనేళ్ళ పిల్ల అయి ఉండగా, వల్లభపుర రాజ్యానికి పడమటి సరిహద్దు మీద ఉండే ఆటవిక తండాల వాళ్ళు తిరుగుబాటు చేశారు. ఈ వార్త విని సుఖలత ఆమితోత్సాహంతో, "నేను సైన్యంతో వెళ్ళి, తిరుగుబాటును అణచి వస్తాను," అన్నది.

తండ్రి నిర్ఘాంతపోయి, "ఏమిటి ఈ పిల్ల దాని ఉద్దేశం? ముక్కు పచ్చలారని ఆడపిల్ల సైన్యానికి నాయకత్వం వహించి యుద్ధానికి పోతా నంటుందేమిటి?" అన్నాడు తన మంత్రి అయిన ధీమాన్‌తో.

"ప్రభూ, ఆమెకు ఆ పాటి శక్తి లేక పోలేదు. ఆమె మంచి శిక్షణ పొందింది. సైన్యం ఆమె చెప్పు చేతలలో ఉంటుంది. ఆమె అంటే అందరికీ ఎంతో అభిమానం. ఈ తిరుగుబాటును అణచటానికి ఆమె పూర్తిగా సమర్థురాలని నా నమ్మకం." అన్నాడు ధీమాన్.

"అదేమీ లేదు. అశుభమూ, శుభమూ ఎరగని పసిపిల్ల, బొమ్మలతో ఆడుకోవలిసిన పిల్ల యుద్ధరంగానికి వెళ్ళట మేమిటి? నేను ఒప్పను." అన్నాడు రాజు.

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

రాణి కూడా, "అదేమిటి, మంత్రిగారూ? మీరుకూడా అమ్మాయిని అలా వెనకేసుకు రాకండి. ఆడవాళ్ళు ఎక్కడన్నా యుద్ధం చేస్తారా? మన దగ్గిర బోలెడంత మంది కాకలుతీరిన యోధు లున్నారు. వారిలో ఎవరికైనా గట్టివాడికి నాయకత్వం యిచ్చి పంపండి," అన్నది.

"మహారాణీ, అమ్మాయిగారు వయసులో చిన్న అయినా, ఆమె మామూలు ఆడపిల్ల లాటిది అనుకోకండి. ఆమె యుద్ధవిద్యలు అన్నిటిలోనూ ఆరితేరింది," అన్నాడు మంత్రి.

"ఇన్ని మాటలు అనవసరం. అమ్మాయి యుద్ధానికి వెళ్ళటానికి వీలులేదు! అంతే!" అన్నది రాణి.

సుఖలత చిన్నబుచ్చుకుని మంత్రి కేసి చూసింది. మంత్రి కన్ను మలిపి, ఆమెకు ఆశ కలిగించాడు.

ఆస్థాన ఇంద్రజాలికుడు ఏదో చెప్ప దలచుకున్నట్టు నింపాదిగా లేచి నిలబడి, "రాజకుమారి యుద్ధానికి వెళ్ళాలని ఉవ్వి ళ్ళూరుతున్నది. మంత్రిగారు ఆమె కోరి కను బలపరుస్తున్నారు. ఎటొచ్చీ మహా రాజుగారికీ, మహారాణిగారికీ ఆ ఆలోచన సమ్మతం కాకుండా ఉన్నది. అందుచేత రాజకుమారికి చాలా ఉత్సాహభంగం కలిగింది. ఇది వాదనతో తేలే విషయం కాదు. భారమంతా దైవం మీద వేసి చీటీ వేద్దాం. సమస్య పరిష్కారం అయి పోతుంది," అన్నాడు.



"నాన్నా, ఇందుకు ఒప్పుకుందూ!" అన్నది సుఖలత తండ్రిని బతిమాలుతూ.

రంగాదిత్యుడు కొంచెం మెత్తబడి, "సరే, దేవుడి నిర్ణయం ఏమిటో చూద్దాం," అన్నాడు నిట్టూర్పు విడిచి.

"అలా అయితే చీటీ వేసే పని ప్రారంభింతాం," అంటూ ఇంద్రపాలుడు, పక్కనే ఉన్న మంత్రిగారి కార్యాలయంలోకి వెళ్ళి, కొన్ని తెల్లకాగితపు ముక్కలూ, రాతపరికరాలూ తెచ్చి, "మహారాజా, సేనలను తీసుకు పోవటానికి తమరు ఎవరి పేరు సూచిస్తారో సెలవియ్యండి," అన్నాడు.

"గంగాధర్," అన్నాడు రాజు.

ఇంద్రపాలుడు, "గం-గా-ధర్" అని ఉచ్చరిస్తూ, తాను తెచ్చిన, కాగితం ముక్కల్లో ఒక దాని మీద రాసి, దాన్ని మడిచి పక్కన పెట్టాడు.

తరవాత అతను రాజుగారినే మరొక పేరు చెప్పమన్నాడు.

"రఘుపతి," అన్నాడు రాజు.

"ర-ఘు-ప-తి," అని పైకి అంటూ ఇంద్రపాలుడు మరొక చీటీరాసి, దాన్ని కూడా మడిచి, మొదట రాసిన చీటీ పక్కన పెట్టాడు.

తరవాత అతను మంత్రిని ఒక పేరు చెప్పమన్నాడు.

"సుఖలత," అన్నాడు మంత్రి.

"సు-ఖ-ల-త," అంటూ ఇంద్రపాలుడు మరొక చీటీ రాసి, దాన్ని కూడా మడిచి పెట్టాడు.



ఇదే విధంగా రాజు మళ్ళీ తొమ్మిది పేర్లు చెప్పాడు. ఇంద్రపాలుడు మరి తొమ్మిది చీటీలు రాసి, మడిచి పెట్టాడు.

చీటీలన్నీ తయారయినాక ఇంద్రపాలుడు వాటిని రాజు వద్దకు తీసుకువచ్చి, వాటిలో ఒక చీటీ తీసుకోమన్నాడు. రాజు తీసుకున్నాడు. వెంటనే ఇంద్రపాలుడు మిగిలిన చీటీలన్నిటినీ కాల్చి బూడిదచేసి, బూడిదను ఎత్తి అవతల పారేయించాడు.

ఈ లోపుగా రంగాదిత్యుడు ఆత్రంగా చీటీవిప్పి, కంపిస్తున్న గొంతుతో, "సుఖలత" అని చదివాడు. ఆయన విధిలేక, తన కూతురు అస్త్రధారణ చేసి తిరుగుబాటును అణచబోవటానికి అనుమతి ఇచ్చాడు. సుఖలత యుద్ధ సన్నద్ధురాలై, సేనలను వెంటబెట్టుకుని వెళ్ళి, తిరుగుబాటు దార్లతో యుద్ధంచేసి ఓడించి, వారి నాయకుణ్ణి పట్టి, విజయలక్ష్మిని వెంటబెట్టుకుని నగరానికి తిరిగి వచ్చింది.

తల్లి తండ్రులు ఆమెను ఆప్యాయంగా కౌగలించుకుని ముద్దు పెట్టుకున్నారు. ప్రజలు అమితంగా హర్షించారు. నగరమంతటా ఉత్సవాలు జరిగాయి.

తరవాత సమయం చూసుకుని సుఖలత మంత్రినీ, ఇంద్రపాలుణ్ణీ తన అభ్యంతర మందిరానికి పిలిపించి, వారికి విందు భోజనాలు పెట్టించి, బహుమానాలతో సత్కరించి, మంత్రిని, "నా కోరిక ఎలా తీర్చగలిగారు?" అని అడిగింది.

"నాకేమీ తెలీదు, తల్లీ. ఈ ఇంద్రపాలుడే ఏదో గారడీ చేశాడు!" అన్నాడు మంత్రి.

ఇంద్రపాలుడు రహస్యంగా, "ఏముందమ్మా? అన్ని చీటీల మీదా నీ పేరే రాశాను. పైకి మాత్రం వేరే వేరే పేర్లు ఉచ్చరించాను," అన్నాడు.

సుఖలత ఆశ్చర్యపోయి, "నాన్నకు ఈ సంగతి తెలిస్తే నీ తల పోయి ఉండేది," అన్నది.

"అవునమ్మా! నీ కోసం నా తల ఒడ్డాను మరి!" అన్నాడు ఇంద్రపాలుడు నవ్వుతూ.



# పనసపండు రుచి

ఒకప్పుడు ఒక వృద్ధుడైన కాబూలీ బెంగాలుకు వచ్చి, ఒక పళ్ళ దుకాణంలో ఒక పెద్ద పండు చూసి ఆశ్చర్యపడి, "నేను ఎన్నోరకాల పళ్ళు తిన్నాను గాని, ఇంత పెద్ద పండు ఎక్కడా చూడలేదు. అది ఏం పండు?" అని అడిగాడు.

"అది పనసపండు. చాలా రుచిగా ఉంటుంది. దేశంలో అందరూ తింటారు," అని దుకాణదారు చెప్పాడు.

కాబూలీ దాన్ని కొనుక్కుని, ఇంటికి తీసుకుపోయి, తాపీగా కూర్చుని, పండును పళ్ళతే పీకాడు. దాని వాసన దివ్యంగా ఉన్నది. రుచి అంతకన్న దివ్యంగా ఉన్నది. కాని, పాపం, అతనికి పనసపండు రసం సంగతి తెలీదు. నిడుపైన అతని గడ్డానికీ, మీసాలకూ రసం అంటుకున్నది; చేతులకు అంటుకున్నది. కడిగితే మరింత అన్యాయ మయింది. బూడిదె పట్టిస్తే అది కూడా వెంట్రుకలకూ, చేతికీ పట్టుకు పోయి వదలనే లేదు. బెంగాలీబాబులు ఇలాటి పండును ఎలా తింటారో కాబూలీ ఊహించుకో లేక పోయాడు.

చివరకు అతను ఒక పెద్దమనిషికి తన అగచాట్లు చెప్పుకున్నాడు. ఆ పెద్ద మనిషి, "పనసపండు తినాలంటే చేతులకూ, ముఖానికి కూడా నూనె రాచుకోవాలి. మీరు గడ్డం గీకేయించటం తప్ప మరో మార్గం లేదు," అన్నాడు.

కాబూలీ అలాగే చేసి పనసరసం జిగురు బాధ వదిలించు కున్నాడు. తరవాత ఆయన ఎవరినన్నా గడ్డం లేకుండా చూసినప్పుడు, "ఓహో! మీరు కూడా పనసపండు తిన్నారా?" అంటూండే వాడు.





# మంచివాడు-చెడ్డవాడు

ఒక ఊళ్లో సుమంతుడు అనే మహాను భావుడు ఉండే వాడు. అయన అపకారికి కూడా ఉపకారం చేసే స్వభావం గలవాడు. ఊరి చివర ఒక కుటీరం వేసుకుని, అందులో ఆయన ఒంటరిగా ఉంటూండే వాడు. ఏ వేళగాని వేళ అతిథి వచ్చినా ఆయన ఆతిథ్యం ఇచ్చేవాడు.

ఒక రోజు దొంగ ఒకడు వడదెబ్బ తగిలి ఆయన కుటీరం ముందు పడి పోయాడు. సుమంతుడు ఎన్నో శైత్యోప చారాలు చేసిన మీదట వాడికి స్పృహ వచ్చింది. ఆకలిగా ఉందని వాడు సంజ్ఞ చేశాడు. అయిదు నిమిషాలలో సుమంతుడు వాడికి చక్కని భోజనం పెట్టాడు. దొంగ అవురావురని భోంచేసినాక వాడికొక అను మానం వచ్చింది.

వాడు సుమంతుణ్ణి, "అయ్యా, ఈ మిట్ట మధ్యాహ్నంవేళ మీరు ఈ విందు భోజనం ఇంత త్వరగా నా కోసం ఎలా తయారు చేయగలిగారు?" అని అడిగాడు.

"నా దగ్గిర మహిమ గల గిన్నె ఉన్నది. దాని సహాయంతో కావలిసిన భోజన పదార్థాలు క్షణంలో సంపాదించవచ్చు," అన్నాడు సుమంతుడు.

దొంగ ఆశ్చర్యపడి, "ఒక్కసారి, ఆ గిన్నె చూపిస్తారా? దాని మహిమ చూడాలని ఉన్నది," అన్నాడు.

సుమంతుడు లోపలికి వెళ్ళి ఒక గిన్నె తెచ్చి, దొంగ చూస్తూండగా దాన్ని నేల మీద బోర్లించి, "అరటిపళ్ళు కావాలి," అన్నాడు. గిన్నె పైకెత్తే సరికి దాని కింద అరటి పళ్లున్నాయి.

ఆ గిన్నెను చూడగానే దొంగకు కన్ను కుట్టింది. వాడు ఆ రాత్రి సుమంతుడి గిన్నెను కాజేశాడు. ఆ గిన్నె సహాయంతో తాను కోటీశ్వరుడైపోవాలని వాడి ఆశ.

"వసుంధర"

కాని ఆ గిన్నె వాడి వద్ద ఏ మహిమా చూప లేదు. వాడు కోరిన ఆహారం కూడా అది వాడికి ఇయ్యలేదు.

మర్నాడు దొంగ ఆ గిన్నెను సుమంతు డికి తెచ్చి ఇస్తూ, "అయ్యా, పొరబాటున మీ గిన్నె తీసుకుపోయాను. నన్ను మన్నించి, మీ గిన్నె మీరు తీసుకోండి," అన్నాడు.

సుమంతుడు ఏ మాత్రమూ ఆగ్ర హించక, వాడి వద్ద నుంచి గిన్నె తీసుకుని, అప్పటి కప్పుడు దానినుంచి పాయసం మొదలైనవి సృష్టించి, దొంగ వాడికి విందు చేశాడు.

దొంగ కుతూహలం పట్టలేక, "అయ్యా, ఈ గిన్నె మీరు కోరిందల్లా యిస్తున్నది. నా దగ్గిర మామూలు గిన్నెలాగే ఉన్నది." అన్నాడు.

సుమంతుడు నవ్వి, "నేను జీవించి ఉండగా ఈ గిన్నె మరొకరికి ఉపయోగ పడదు," అన్నాడు.

దొంగకు ఇప్పుడు గిన్నె రహస్యం తెలిసి పోయింది. సుమంతుణ్ణి చంపి గిన్నె మహిమ తన కోసం ఉపయోగించుకో దలచి వాడు విషం కలిపిన ఆహారం తీసు కుని సుమంతుడి వద్దకు వచ్చి, "అయ్యా, మీరు నాకు రెండుసార్లు విందుభోజనం పెట్టారు. దానికి ప్రతిఫలంగా మీకు ఈ ఆహారం తెచ్చాను. దీన్ని ఆరగించి నన్ను ధన్యుణ్ణి చెయ్యండి," అన్నాడు, వంగి నమస్కరించి.



సుమంతుడు సంకోచించకుండా దొంగ తెచ్చిన ఆహారాన్ని వాడి ముందే తినేశాడు. తరవాత దొంగ వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి పొద్దుపోయినాక దొంగ సుమంతుడి కుటీరం ప్రవేశించాడు. సుమంతుడు మంచం మీద పడి ఉన్నాడు. దొంగ గిన్నె ఉన్నచోటికి పోతూండగా కాలికి ఏదో తగిలి, పడిపోయాడు.

ఆ అలికిడికి సుమంతుడు కళ్ళుతెరిచి, లేచి కూర్చుని, "ఎవరది?" అని అడిగాడు.

దొంగ ఆశ్చర్యపడి, "తమరు జీవించే ఉన్నారా, స్వామీ?" అని అడిగాడు.

"అదేం? నేను జీవించి ఉండనని ఎందు కనుకున్నావు?" అన్నాడు సుమంతుడు.

"ఈ రోజు నేను మీకు ఇచ్చిన ఆహారంలో భయంకరమైన విషం కలిపాను. అది ఈ పాటికి తప్పక మీ ప్రాణాలు తీసి ఉంటుందనుకున్నాను." అన్నాడు దొంగ.

"నేను యోగాభ్యాసం చేస్తాను. ఎలాటి విషాన్నయినా జీర్ణించు కోగలను," అన్నాడు సుమంతుడు నిశ్చలంగా.

"మీకు విషంపెట్టి చంపేసి, మీ గిన్నె తీసుకుపోయి సుఖంగా బతుకుదా మను కున్నాను. కాని ఫలితం దక్కలేదు," అన్నాడు దొంగ నిరుత్సాహ పడిపోయి.

సుమంతుడు, "సరే, నీ అదృష్టం బాగా లేదు. అయితే, ఖోంచేసి వెళతావా?" అని దొంగను అడిగాడు.

ఆ మాటవిని దొంగకు చాలా సిగ్గు వేసింది. దానితో బాటు వాడి కొక అను మానం కూడా కలిగింది.

"స్వామీ, నేను మీకు ద్రోహం తల పెట్టినా, మీరు నన్ను అసహ్యించు కోవటం లేదు. పైగా నన్ను ఎంతో మంచిగా చూస్తు న్నారు. ఈ అనుభవం నాకు చాలా విచిత్రంగా ఉన్నది." అన్నాడు వాడు.

"ఇందులో విచిత్రమే మున్నది? మంచి చేయడం నా అలవాటు, చెడు చేయడం నీ అలవాటు. నీ అలవాటును నువు వదులుకో లేనప్పుడు నా అలవాటును నే నెలా వదులుకో గల ననుకున్నావు?" అన్నాడు సుమంతుడు.



# ఆకలి రుచి ఎరగదు

ఒకసారి ఒక రాజు వేటకు బయలుదేరి అడవిలో దారి తప్పాడు. రాజుతో పాటు వంటవాడు కూడా ఉన్నాడు. మధ్యాహ్నం అయింది. ఇద్దరికీ ఆకలి దహించుకు పోతున్నది. ఇద్దరూ అడవి సమీపాన గల ఒక చిన్న గ్రామం చేరి, ఒక ఇంటి తలుపు తట్టారు. ఆ ఇంట్లో ఒంటరిగా ఉంటున్న ముసలమ్మ తలుపు తీసి, అతిథులిద్దరూ ఆకలిమీద ఉన్నారని గ్రహించి, చప్పని నూకల అన్నం వండి, గడ్డిపచ్చడి చేసి పెట్టింది. రాజు ఆ నూకల అన్నాన్ని గడ్డిపచ్చడితో అవురావురున తిని, బ్రహ్మాండంగా ఉన్నదని మెచ్చుకుని, ముసలమ్మకు తన మెడలో ఉన్న రత్నహారాన్ని బహుమతిగా ఇచ్చాడు.

పంచభక్ష్య పరమాన్నాలను ఆరగించి కూడా ఇంత సంతోషించని రాజు గడ్డి పచ్చడిని మెచ్చుకోవటం చూసి వంటవాడు ఆశ్చర్యపడ్డాడు. వాళ్ళు కోటకు తిరిగి వచ్చి నాక వాడు, రాజుగారికి ఇష్టం గదా అని, గడ్డిపచ్చడి చేసి వడ్డించాడు. దాన్ని రుచి చూస్తూనే రాజు మండిపడి, వంటవాణ్ణి ఉద్యోగం నుంచి తొలగించినంత పనిచేశాడు.

—పి. ప్రభాకరదేవ్





# వరపరీక్ష

పూర్వం విశాలనగరాన్ని దేవదత్తుడు అనే రాజు పాలించేవాడు. ఆయనకు చంద్రమతి ఒక్కతే సంతానం. చంద్రమతి ఎన్నడూ రాజభవనం దాటి బయటికి వచ్చేది కాదు. కాని ఆమె అందగత్తె అనీ, ఆమె చెయ్యి తగిలితే దీర్ఘరోగాలు కూడా నయమవుతాయనీ పుకారు ఉండేది.

చంద్రమతికి యుక్తవయసు వచ్చింది. తండ్రి ఆమెతో ఆమె వివాహం గురించి ప్రస్తావించాడు.

"నాకు భర్త కాదగిన వారిని మీరు నిర్ణయించండి. వారిలో నాకు కావలిసిన వాణ్ణి నేను ఎన్నుకుంటాను," అన్నది చంద్రమతి తండ్రితో.

దేవదత్తుడు చుట్టు పక్కల ఉండే దేశాల రాజకుమారు లందరిని గురించీ విచారించి స్వయం వరానికి రమ్మని నలుగురు రాజకుమారులను ఆహ్వానించాడు. జయుడూ, అజయుడూ, విజయుడూ, వినయుడూ అనే నలుగురు రాజకుమారులు చంద్రమతిని వివాహమాడే ఉద్దేశంతో వచ్చారు. దేవదత్తుడు వారికి రాజోచితంగా సత్కారాలు జరిపి, నలుగురినీ మందిరంలో కూర్చొబెట్టి, తాను కూడా కూర్చున్నాడు.

అప్పుడు దేవదత్తుడు ఆ పక్కగా వెళుతున్న ఒక పరిచారికను పిలిచి, "చండీ, అమ్మాయిగారిని ఒక్కసారి పిలుచుకురా," అన్నాడు.

చండి గబగబా వెళ్ళి, వెంటనే తిరిగి వచ్చి, "చిన్న రాణీగారు పూజామందిరంలో ఉన్నారు. పున్నమి వెళ్ళినదాకా పూజ పూర్తికాదుట. వారు పూజామందిరం నుంచి ఇవతలికి రారుట," అన్నది.

దేవదత్తుడు రాజకుమారులతో, "నాలుగు రోజుల పాటు చేసేదేమీ లేదు. మీకు

ఎం. కామేశ్వరరావు

సుఖంగా వుండేందుకు అన్ని సౌకర్యాలూ అమర్చుతాను. మీకు ఏ వేళకు ఏం కావాలన్నా చండితో చెబితే, ఆమె అన్ని ఏర్పాట్లూ చూస్తుంది,'' అన్నాడు.

రాజకుమారులు అందుకు సమ్మతించారు. వారికి దివ్యమైన బసలు రాజభవనంలోనే వేరువేరుగా ఏర్పాటు అయాయి. చండి ఒకరి తరవాత ఒకరి వద్దకు వచ్చి, వారి యోగక్షేమాలు విచారిస్తున్నది.

జయుడు అనే రాజకుమారుడు చంద్రమతి అందగత్తె అని విని, అందుకోసం ఆమెను పెళ్ళాడగోరి వచ్చాడు. అతను చంద్రమతి అందాన్ని కళ్ళారా చూడాలని తహ తహ లాడి పోతున్నాడు. అందుకోసం నాలుగు రోజులు వేచి ఉండాలంటే అతనికి నాలుగు యుగాలు వేచి ఉండటం లాగా తోచింది.

మొదటి రోజు సాయంత్రం చండి జయుడి గదిలో సుగంధ పుష్పాలు అమర్చటానికి వచ్చింది. అప్పుడు జయుడు ఆమెను దగ్గిరికి పిలిచి, ''చండీ, నేను రాజకుమార్తెను వెంటనే చూడాలి. చూపించగలవా?'' అని అడిగాడు.

చండి కొంచెం భయపడినట్టు కనబడి, ''మీకు అంతగా చూడాలని ఉంటే నిశ్శబ్దంగా నా వెంట రండి,'' అంటూ మసక



వెలుతురు గల నడవల కుండా అంతఃపురం కేసి దారితీసింది. జయుడు ఆమెను అనుసరించాడు.

చండి పూజామందిరం వద్దకు వచ్చి, ద్వారానికి అడ్డంగా ఉన్న పట్టుతెర కొద్దిగా తొలగించి, తాను లోపలికి తొంగిచూసి, జయుణ్ణి కూడా చూడమని సైగ చేసింది. అతను లోపలికి చూసి దడుచుకున్నాడు. పార్వతీదేవి విగ్రహం ముందు కూర్చుని పూజచేస్తున్న మనిషి నల్లగా, లావుగా, ఎత్తు పళ్ళతో పరమ వికారంగా ఉన్నది.

''ఛీ, ఛీ! ఈ భూతకి కోసమా నేను ఇంత ఆరాటపడింది?'' అనుకుని, చండి ఎంత చెప్పినా వినిపించుకోకుండా జయుడు



ఆ రాత్రే తన దేశానికి ప్రయాణం కట్టి, వెళ్ళిపోయాడు.

మర్నాడు చండి అజయుడున్న గదిలో పరువులు దులిపి, పక్క సరిచేస్తుండగా అజయుడు ఆమెతో, "జయుడు మాట మాత్రమైనా చెప్పకుండా, రాత్రికిరాత్రే ప్రయాణమై వెళ్ళిపోయాడు. కారణం ఏమిటో?" అన్నాడు.

చండి దగ్గిరికి వచ్చి, రహస్యంగా, "జయుడుగారు రాజకుమార్తెను చూడాలని ఉన్నదంటే, నేను బుద్ధిలేక రహస్యంగా ఆయనకు చూపించాను. ఆయనకు చిన్న రాణీగారి అందం నచ్చలేదుట, అలిగి వెళ్ళిపోయారు," అన్నది.

అజయుడు కొంచెం ఆలోచించి, "చేసుకునే భార్యకు అందం అవసరమే ననుకో. కాని ఆ భార్యతో బాటు రాజ్యం కూడా వస్తున్నప్పుడు అందానికి అంత ప్రాముఖ్యం ఇవ్వవలిసిన పనిలేదు. జయుడు పారిపోవలసింది కాదు," అన్నాడు.

అతను రాజ్యంకోసం చంద్రమతిని పెళ్ళాడటానికి వచ్చాడు.

చండి ఆశ్చర్యపోయి, "చిన్నరాణిగారిని పెళ్ళాడితే విశాలరాజ్యం వస్తుందనుకుంటున్నారా ఏం? రాజుగారు తన తమ్ముడి కొడుకును దత్తు చేసుకోవటానికి ఏనాడో నిశ్చయించారు!" అన్నది.

ఆ మాట వినగానే అజయుడు నీరు కారిపోయి, "అయితే నా కిక్కడ ఏం పని?" అంటూ అప్పటి కప్పుడే ప్రయాణం కట్టి తన దేశానికి వెళ్ళిపోయాడు.

మర్నాడు చండి తోటలో సన్నజాజులు కోస్తూ ఉండగా విజయుడు ఆమెను సమీపించి, "నిన్న ఎక్కడా కనిపించలేదు. ఏమయిపోయావు?" అని అడిగాడు.

ఆమె అతనితో జయుడి సంగతీ, అజయుడి సంగతి చెప్పింది.

అంతా విని విజయుడు నవ్వి, "పిచ్చివాడు! సరిగా ఏలుకుంటే అజయుడికి తన రాజ్యం చాలదూ? రాజకుమార్తె కురూపి అయినా, రాజ్యం తీసుకు రాకపోయినా

నాకు అభ్యంతరం లేదు. ఆమె చెయ్యి తాకితే ఎంత దీర్ఘ రోగాలయినా నయమవు తాయిట. నా తల్లి దండ్రు లిద్దరూ దీర్ఘ రోగులు. మీ చిన్న రాణీగార్ని పెళ్ళాడి, మా ఇంటికి తీసుకుపోయి, వాళ్ళ జబ్బు నయం చేసుకుందామను కుంటున్నాను. ఆ ఆశతోనే ఇక్కడ వేచి ఉన్నాను," అన్నాడు.

చండి ఆశ్చర్యపడుతూ, "మనిషి చెయ్యి తగిలితే రోగాలు నయం కావటం ఎక్కడైనా కద్దా? మీకీ మాట ఎవరు చెప్పారు? మీరెలా నమ్మారు?" అని విజ యుణ్ణి అడిగింది.

విజయుడు హతాశుడై, "అంతేనా? ఇంకా నయం, ఈ మాట త్వరగా చెప్పావు!" అని, ఆ రోజే ప్రయాణమై తన దేశానికి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి చండి వినయుడి గదికి వెళ్ళే సరికి అతను ఏదో బాధతో, మరణవేదన పడుతున్నాడు.

"ఏమిటి మీ బాధ?" అని చండి అడిగింది.

"చండీ, నేను ఎంతోసేపు బతకను. అకస్మాత్తుగా గుండెలో పోటు ప్రారంభ మయింది! కారణం తెలియదు. అబ్బా, ఏం బాధ!" అంటూ వినయుడు గిలగిలా తన్నుకోసాగాడు.

చండి వెంటనే వెళ్ళి వైద్యుణ్ణి తెచ్చి, వినయుడికి నిద్రపట్టటానికి మందు ఇప్పించి, అతను తన్నుకోవటం మాని



కన్ను మూసుకోగానే అతని ఛాతీ మీద చేత్తో కొంతసేపు రాచింది.

మర్నాడు ఉదయం వినయుడు నిద్ర లేచే సరికి అతనికి ఏ బాధా లేదు. తన తల దగ్గిర కూర్చుని చండి తనకు విసురుతూ కనిపించింది.

వినయుడు ఆశ్చర్యంగా, "చండీ, తెల్ల వార్లూ ఇక్కడే ఉన్నావా? నీ మేలు ఎలా మరవను? అద్భుతమైన వైద్యం చేయిం చావు. నా గుండె జబ్బు ఎలా వచ్చిందో అలాగే పోయింది. నిమిషాల మీద చచ్చి పోతా ననుకున్నవాణ్ణి ఏమీలేనట్టే ఉన్నాను. చూడు, చండీ! నేను రాజకుమార్తెను పెళ్ళాడే ఆలోచన మానేశాను. నేను కోరి నది అన్యోన్యంగా ఉండే భార్య. నాలుగు రోజులుగా చూస్తున్నాను. నీ కన్న అన్యోన్య మైన భార్య నాకు ఎక్కడ దొరుకుతుంది? నాతో మా దేశానికి వచ్చెయ్యి. నిన్ను పెళ్లాడ తాను," అన్నాడు.

ఆ మాట విని చండి పరమానందం చెంది, "మిమ్మల్ని తప్పక పెళ్ళాడతాను. నేను కూడా అన్యోన్యమైన భర్త కోసమే చూస్తున్నాను. అన్నట్టు నా పేరు చండి కాదు, చంద్రమతి," అన్నది.

వినయుడు ఎక్కడలేని ఆశ్చర్యంతో, "నువు రాజకుమార్తె చంద్రమతివా?" అని అడిగాడు.

"అవును. నేను మీ నలుగురికి పరీక్ష పెట్టాను. మిగిలిన ముగ్గురికీ కావలిసింది నేను కాదు. ఒకరు నా అందం కోరారు. మరొకరు నా రాజ్యం కోరారు. ఇంకొకరు నా హస్తవాసి కోరారు. మీరు మాత్రమే నన్ను కోరారు. అందుచేత నేను కూడా మిమ్మల్ని కోరుతున్నాను," అన్నది చంద్రమతి.

ఆమె చేతిస్పర్శ చేతనే తన వ్యాధి నివారణ అయినట్టు వినయుడు తెలుసు కున్నాడు. అతనికి ఆమె పట్ల అంతులేని కృతజ్ఞత ఏర్పడింది.

త్వరలోనే మంచి ముహూర్తం చూసి దేవదత్తుడు తన కుమార్తెను వినయుడి కిచ్చి వైభవంగా పెళ్ళి చేసేశాడు.






పాండవులను గురించి ధృతరాష్ట్రుడు అన్న మాటకు సంజయుడు, "రాజా, పాండవుల వద్ద మంత్రాలూ, మాయలూ ఏమీ లేవు. వాళ్ళు యుద్ధంలో తమ శక్తి చూపుతున్నారు. వాళ్ళ ధర్మమే వాళ్ళకు యుద్ధంలో జయం కలిగిస్తున్నది. నీ కొడుకులు చేసిన దుష్కర్మలు విషవృక్షమై వారిని నాశనం చేస్తున్నాయి. నీకు ఎంత మంది హితం చెప్పలేదు? నువు మాత్రం విన్నావా? విదురుడూ, భీష్మ ద్రోణులూ, నేనూ ఎంతో చెప్పాం. నీ కవి ఏ మాత్రమూ రుచించలేదు. ఇప్పుడు నువు నన్నడిగినట్టే, శిబిరంలో రాత్రివేళ దుర్యోధనుడు భీష్మణ్ణి కూడా అడిగాడు," అంటూ జరిగినదంతా తెలిపాడు.

"తాతా, నువ్వూ, ద్రోణుడూ, కృపుడూ, ఇతర మహారథులూ నా కోసం ప్రాణాలొడ్డి పోరుతున్నా కూడా పాండవుల ముందు నిలవలేకుండా ఉన్నారు. అందుకు కారణం ఏమిటి?" అని దుర్యోధనుడు భీష్మణ్ణి అడిగాడు.

దానికి భీష్ముడు, "నాయనా, నీకు చాలా సార్లు చెప్పాను, మళ్ళా చెబుతున్నాను. పాండవులతో సంధి చేసుకో. నువ్వూ, నీ తమ్ములూ సుఖంగా ఉండండి. కృష్ణుడు పాండవులకు అండగా ఉండగా వారి నెవరూ చంపలేరు," అని అతనికి విశ్వోపాఖ్యానం ఇలా చెప్పాడు:

ఒకసారి బ్రహ్మదేవుడు గంధమాదన పర్వతం మీద కూర్చుని ఉండగా దేవ



తలూ, ఋషులూ వచ్చి ఆయన చుట్టూ చేరారు. ఆ సమయంలో ఆకాశంలో కాంతివంతమైన విమానం ఒకటి వారికి కనిపించింది. బ్రహ్మ దాన్ని చూసి చేతులు జోడించి ధ్యానించాడు. అది చూసి దేవతలూ, ఋషులూ లేచి నిలబడి నమస్కారాలు చేశారు.

బ్రహ్మ ఆ విమానాన్ని స్తుతించి, "దేవదేవా, నీ అంశను పంపి, యదువంశంలో జన్మింపజెయ్యి," అని అడిగాడు.

"నీ కోరిక గ్రహించాను. అలాగే చేస్తాను," అన్న జవాబు వినిపించింది. దేవతలూ, ఋషులూ ఆశ్చర్యపోయి చూస్తూన్నంతలో విమానం అంతర్ధానమయింది.

అప్పుడు దేవతలూ, ఋషులూ బ్రహ్మను, "పితామహా, నువు ప్రార్థించినది ఎవరిని? దేనికి ప్రార్థించావు?" అని అడిగారు.

దానికి బ్రహ్మ, "ఆయన మహావిష్ణువు. పూర్వం చచ్చిపోయిన దైత్యులూ, దానవులూ, రాక్షసులూ తిరిగి భూమి మీద జన్మించారు. వారిని చంపటానికి నరుడితో బాటు నారాయణుడు కూడా మానవుడుగా పుట్టాలి. వారివెంట దేపతులు కూడా పుట్టుతారు. వారిని ఎవరూ జయించలేరు. మూఢులు ఈ సంగతి తెలుసుకో లేరు," అన్నాడు.

భీష్ముడీ కథ చెప్పి దుర్యోధనుడితో, "నువు ఒక క్రూరరాక్షసుడివై ఉండాలి. అందుకే కృష్ణార్జునులతో వైరం పెట్టుకున్నావు." అన్నాడు. తరవాత ఎవరి శిబిరాలకు వారు వెళ్ళి నిద్రపోయారు.

యుద్ధం అయిదో రోజు తెల్లవారింది. ఉభయసేనలూ వ్యూహాలుపన్ని యుద్ధానికి సిద్ధమయ్యాయి. కౌరవులది మకరవ్యూహం, పాండవులది డేగవ్యూహం. ఆ వ్యూహానికి ముందు భీముడూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ నిలబడ్డారు. వారికి వెనకగా సాత్యకీ, అర్జునుడూ ఉన్నారు.

దుర్యోధనుడు ద్రోణుడితో, "ఇవాళ పాండవులు చచ్చిపోయేటట్టు చూడు," అని చెప్పాడు. ఈ మాట వింటూనే ద్రోణుడు సాత్యకిని ఎదుర్కొన్నాడు. సాత్యకికి

తోడుగా భీముడూ, ద్రోణుడికి తోడుగా భీష్మ, శల్యులూ వచ్చి యుద్ధం చేశారు. భీష్మ, ద్రోణులు చేసే దారుణయుద్ధాన్ని ఎదుర్కొనేటందుకు అభిమన్యుడూ, ఉప పాండవులూ, శిఖండీ వచ్చారు. శిఖండితో భీష్ముడు యుద్ధం చెయ్యలేదు. ద్రోణుడు శిఖండిని భయంకరంగా ఎదుర్కొనే సరికి, శిఖండి నిలవలేక తప్పుకుని వెళ్ళాడు. అప్పుడు పాండవుల వెంట అర్జునుడు వచ్చి భీష్ముడి పై తలపడ్డాడు. ఇద్దరూ పట్టుదలతో యుద్ధం చేశారు. అదే సమయంలో ఉభయ పక్షాల వీరులూ విజృంభించి యుద్ధం చేశారు. ఆ యుద్ధంలో సేనలు అపారంగా నష్టమయాయి.

ఈ అయిదో రోజు యుద్ధంలో ముఖ్యంగా చెప్పుకోదగిన ఘట్టాలేవంటే: అశ్వత్థామకూ అర్జునుడికీ జరిగిన యుద్ధంలో అర్జునుడు అశ్వత్థామ ధరించిన కవచాన్ని తన బాణాలతో ఛేదించాడు. దాన్ని అశ్వత్థామ లక్ష్యపెట్టక సాహసంతో పోరసాగాడు, కాని అర్జునుడు అశ్వత్థామ గురుపుత్రుడని అతన్ని వదిలేసి ఇతర శత్రువులను వెతుక్కుంటూ వెళ్లాడు. దుర్యోధనుడికీ భీముడికీ ఈ రోజు గొప్ప యుద్ధం జరిగింది. అభిమన్యుడు లక్ష్మణ కుమారుడితో చేసిన యుద్ధంలో కృపుడు లక్ష్మణకుమారుణ్ణి రక్షించి, అవతలికి తీసుకుపోయాడు.



ఆ రోజు సాత్యకి విజృంభించి కౌరవ సేనలను భీభత్సం చేస్తూ ఉండటం చూసి దుర్యోధనుడు అతని పైకి అనేక రథాలను పంపాడు. సాత్యకి అస్త్రాలతో ఆ రథికులందరినీ నానా తిప్పలూ పెట్టుతూ, ఆ సేనకు నాయకుడైన భూరిశ్రవుడి పైకి వచ్చాడు. భూరిశ్రవుడు గొప్ప యోధుడు. ఆయన చేసే యుద్ధానికి తట్టుకోలేక, సాత్యకికి అండగా ఉన్న యోధులందరూ చెల్లా చెదరుగా పారిపోయారు. అప్పుడు సాత్యకి కొడుకులు వచ్చి, భూరిశ్రవుణ్ణి చుట్టుముట్టి, భూరిశ్రవుడి చేతిలో చావుదెబ్బలు తిన్నారు. వారు పడిపోవటం చూసి సాత్యకి కోపోద్రేకంతో భూరిశ్రవుడితో ద్వంద్వయుద్ధం



సాగించాడు. ఇద్దరి రథాలూ ధ్వంస మయాయి. వారు కత్తులు తీసుకుని నేలపై నిలబడ్డారు. ఆ సమయంలో భీముడు వచ్చి సాత్యకిని తన రథంలోకి తీసుకున్నాడు. అలాగే భూరిశ్రవుణ్ణి దుర్యోధనుడు తన రథంలో తీసుకుపోయాడు.

సూర్యాస్తమయం అయే సమయానికి రెండుపక్షాల సేనలూ అలిసిపోయి, యుద్ధం సాగించలేక, తమ తమ శిబిరాలకు వెళ్ళిపోయాయి.

ఆరో రోజు తెల్లవారగానే మళ్ళీ యుద్ధం ప్రారంభమయింది. పాండవ సేనలు మకర వ్యూహమూ, కౌరవ సేనలు క్రౌంచ వ్యూహమూ ధరించాయి. కాని ఈ వ్యూహాలు భగ్నం కావటానికి ఎంతోసేపు పట్టలేదు. ఆరంభంలోనే భీముడికీ, ద్రోణుడికీ పడింది. ద్రోణుడు భీముణ్ణి బాణాలతో తీవ్రంగా కొట్టాడు. భీముడు మండిపడి ద్రోణుడి సారథిని చంపాడు. ద్రోణుడు తన రథాన్ని తానే నడుపుకుంటూ యుద్ధం చేసి, పాండవ సేనలను చిందరవందర చేసేశాడు. ఇందులో భీష్ముడు ద్రోణుడికి తోడయాడు. అదే విధంగా భీమార్జునులు కౌరవసేనా వ్యూహాన్ని చిన్నాభిన్నం చేశారు. యుద్ధం దొమ్మి యుద్ధంగా పరిణమించింది.

భీముడు భీష్ముణ్ణి లెక్కచెయ్యక, ధృతరాష్ట్రుడి కొడుకులను చంపే నిశ్చయంతో కౌరవసేన ప్రవేశించాడు. వాళ్ళు అతన్ని ప్రాణాలతో పట్టుకోవాలనుకుని చుట్టుముట్టారు. భీము డది గమనించి, గద తీసుకుని రథం నుంచి కిందికి దూకి తన చుట్టూ ఉన్న కౌరవసేనను నిర్మూలించ సాగాడు.

ద్రోణుడితో యుద్ధం చేస్తున్న ధృష్టద్యుమ్నుడు దూరంగా ఉన్న భీముడి రథం చూసి, ద్రోణుణ్ణి విడిచి భీముడి రథాన్ని చేర వచ్చి, రథం ఖాళీగా ఉండటం చూసి, సారథిని, "భీముడేమయాడు?" అని అడిగాడు.

దానికి సారథి విశోకుడు, "రాజా, నన్ను రెండు గడియలు ఇక్కడే ఉండమని

భీముడు కౌరవసైన్యంలో జొరబడ్డాడు,'' అన్నాడు. భీముడికి అపాయం కలుగుతుందని శంకించి ధృష్టద్యుమ్నుడు తాను కూడా అతని మార్గానే బయలుదేరాడు. కొంత దూరం వెళ్ళేసరికి, భీముడు దారిలో అడ్డమైన ఏనుగులనూ, సైనికులనూ చంపుతూ ధృష్టద్యుమ్నుడికి కనిపించాడు. అంతలోనే కౌరవయోధులు భీముణ్ణి చుట్టుముట్టి, అతని మీద బాణవర్షం కురిపించారు. ధృష్టద్యుమ్నుడు వచ్చి చేరేసరికి, భీముడు ఒళ్ళంతా నెత్తుర్లు కారుతూ కూడా మృత్యుదేవతలాగా కనిపించాడు. ధృష్టద్యుమ్నుడు అతన్ని తన రథం మీద ఎక్కించుకుని, అతని శరీరంలో గుచ్చుకున్న బాణాలన్నీ పెరికి, కౌగలించుకున్నాడు.

ఈ లోపల ధృతరాష్ట్రుడి కొడుకులు భీముణ్ణీ, ధృష్టద్యుమ్నుణ్ణి కూడా ఒకే దెబ్బతో చంపెయ్యాలని వచ్చిపడ్డారు. వారి బాణాల వర్షంలో మునిగి కూడా ధృష్టద్యుమ్నుడు చలించక,, వారి నందరినీ సమ్మోహనాస్త్రంతో మూర్ఛపోగొట్టాడు. అంతలో ద్రోణుడు వచ్చి ప్రజ్ఞాస్త్రం ప్రయోగించి, మూర్ఛపోయిన వారందరినీ లేపగొట్టాడు.

ఇంతలో ధర్మరాజు, భీమ, ధృష్టద్యుమ్నులు ఏమైనదీ తెలియక, అభిమన్యుడు మొదలైన పన్నెండు మంది యోధులను పంపాడు. వారిని చూడగానే భీమ, ధృష్టద్యుమ్నులు మరింత ఉత్సాహంగా యుద్ధం చెయ్యసాగారు. అంతలో





లోకి వచ్చి కూడా, ప్రాణాలతో తప్పించుకు పోయినందుకు కలతపడ్డాడు.

యుద్ధరంగందక్షిణపార్శ్వంలో అర్జునుడు విజృంభించి అంతులేని శత్రుసేనలను నిర్మూలించాడు.

సూర్యుడు పడమటికి దిగుతూ ఉండగా దుర్యోధనుడికి భీముణ్ణి చంపాలని తీవ్రమైన కోరిక పుట్టింది. అతను భీముణ్ణి ఎదుర్కొని, భీముడి చేత తన గొడుగూ, ధ్వజమూ విరగ గొట్టించుకుని, చివరకు చావుదెబ్బలు తిని, కృపుడి రథంలో విశ్రాంతి తీసుకున్నాడు. అప్పుడు ధృష్టకేతువూ, అభిమన్యుడూ, ఉపపాండవులూ, కేకయులూ ధృతరాష్ట్రుడి కొడుకుల మీద యుద్ధం సాగించారు. ఉభయపక్ష వీరుల మధ్య జరిగిన యుద్ధంలో దుష్కర్ణుడు అనేవాడు చచ్చాడు.

కొంత సేపటికి సూర్యుడు అస్తమించాడు. రెండు సేనలూ శాంతించాయి. యుద్ధం చాలించి దుర్యోధనుడు తమ శిబిరానికి తిరిగి వెళ్ళాడు. ధర్మరాజు భీముణ్ణీ, ధృష్టద్యుమ్నుణ్ణీ సంతోషంతో కౌగలించుకుని తానుకూడా తమ శిబిరానికి తిరిగి వెళ్ళాడు.

కొంత విశ్రాంతి తీసుకున్న తరవాత దుర్యోధనుడు భీష్ముడితో, "తాతా, మనం ఎంత అభేద్యమైన వ్యూహాలను పన్నినా

ధృష్టద్యుమ్నుడికి, తన తండ్రి ద్రుపదుడు ద్రోణుడి దెబ్బకు తట్టుకోలేక పారిపోవటం కనిపించింది. అతను ద్రోణుడితో తలపడి, తన రథాన్నీ, సారథినీ కోల్పోయి, వేగంగా అభిమన్యుడి రథం ఎక్కాడు. ద్రోణుడు పాండవ సేనలను అల్లకల్లోలం చేస్తుంటే భీముడూ, ధృష్టద్యుమ్నుడూ ఏమీ చేయలేక పోయారు. ద్రోణుడి పరాక్రమాన్ని ఉభయ సేనలూ మెచ్చుకున్నాయి.

భీముణ్ణి పట్టుకునే ఆలోచన దుర్యోధనాదులకు మళ్ళీవచ్చింది. కాని, ధర్మరాజు పంపిన అభిమన్యుడు మొదలైనవారు వాళ్ళను తరిమేశారు. భీముడు మాత్రం ఆ దుర్యోధనాదులు తనకు అందుబాటు

పాండవులు వాటిని భగ్నంచేసి, విజృం భిస్తున్నారు. భీముడు ఇవాళ మన క్రౌంచ వ్యూహంలో చొరబడి, నన్ను చాలా పీడించాడు. వాడి భయంకరాకారం చూసి నేను మూర్ఛపోయాను. నా మనసు అందోళన పడుతున్నది. నీ అనుగ్రహంతో పాండవులను చంపి, జయం పొందుదామని నా ఆశ," అన్నాడు.

దానికి భీష్ముడు, "నాయనా, నీకు జయం కలగాలని నేను శాయశక్తులా పాటుపడుతున్నాను. ఏ మాత్రమూ ఒళ్ళు దాచుకోవటం లేదు. పాండవుల పక్షాన పోరుతున్నవాళ్ళు శూరులూ, మహా రథులూ, అస్త్రవేత్తలూనూ. అన్నిటికీ తెగించి పోరాడుతున్న ఆ వీరులను సుల భంగా జయించటం సాధ్యపడదు. నేను నా ప్రాణాలను లక్ష్యపెట్టకుండా నీ కోసం యుద్ధం చేస్తున్నాను. నీ కోసం అవసర మైతే మూడు లోకాలనూ భస్మం చెయ్యా టానికి సిద్ధంగా ఉన్నాను. ఎలాంటి విచా రమూ పెట్టుకోకు," అన్నాడు.

ఈ మాట విని దుర్యోధనుడు చాలా సంతోషించాడు.

భీష్ముడు కొంచెం ఆలోచించి, దుర్యోధ నుడితో మళ్ళీ ఇలా అన్నాడు:

"నీ కోసం పోరాడటానికి ఉత్సాహ పడుతున్నవారిలో నేనుగాక, ద్రోణుడూ, శల్యుడూ, కృతవర్మ, అశ్వత్థామా, సోమ దత్తుడూ, సైంధవుడూ, విందాను విందులూ, బాహ్లికుడూ, బృహద్బలుడూ, చిత్రసేనుడూ, వివింశతీ మొదలైన మహా వీరులూ, అనేక వేల రథయోధులూ, గజ, అశ్వ బలాలూ సిద్ధంగా ఉన్నాయి. వీరందరూ దేవతలనైనా జయించ గలవాళ్ళే. అయితే, నీ హితం కోరి ఒకమాట చెప్పాలి; ఇంద్రుడితో దేవత లంతా కదిలివచ్చినా పాండవులను జయించ లేరు. అందుచేత పాండవులే నన్ను జయిస్తారో, నేనే పాండవులను జయిస్తానో చెప్పటం నాకు సాధ్యంకాదు."

ఈ మాటచెప్పి భీష్ముడు, దుర్యోధనుడి శరీరానికి తగిలిన గాయాలు మానటానికి విశల్యకరణి అనే మందు ఇచ్చాడు.






## 5

దమనకం చెప్పిన దంతిలుడి కథ విని సంజీవకం, "నువు చెప్పిన కథ సరిగానే ఉన్నది. అందుచేత నువ్వన్నట్టే కానీ," అన్నది.

తరవాత దమనకం సంజీవకాన్ని పింగళకం వద్దకు తీసుకుపోయి, "మహారాజా, ఇదుగో సంజీవకం. ఆ పైన దేవర చిత్తం." అన్నది.

సంజీవకం పింగళకానికి ప్రణామం చేసి, ఎంతో నమ్రతగా ఎదట కూర్చున్నది.

పింగళకం వాడీ, భయంకరమూ అయిన గోళ్ళు గల బలమైన తన కుడి పంజా చాచి, "స్వాగతం. నీ ఆరోగ్యం ఎలా ఉన్నది? నువు ఈ అరణ్యానికి ఎందుకు వచ్చావు?" అని అడిగింది.

తాను వర్ధమానుడి బిడారు వెంట వచ్చి ఒంటరిగా దిగబడిపోవటమూ, తరవాత జరిగినదీ యావత్తూ సంజీవకం సింహానికి చెప్పింది.

"మిత్రమా, నీకు ఎలాంటి భయమూ వద్దు. నువు నీ ఇచ్ఛానుసారం ఈ అరణ్యంలో జీవించు. కాని ఎల్లప్పుడూ నా కనుచూపు మేరలో ఉండు. ఎందుకంటే, నిన్ను నేను కనిపెట్టి ఉండలేనప్పుడు నీకు అపకారం చేసే క్రూరమృగాలు, పాపభీతి లేనివి, ఈ అరణ్యంలో చాలా ఉన్నాయి," అన్నది పింగళకం.

"చిత్తం," అని సంజీవకం యమునా నదికి వెళ్ళి, కడుపు నిండా నీరు తాగి, వెనకటిలాగా యథేచ్ఛగా, నిర్భయంగా అరణ్యంలో సంచరించసాగింది.

రోజులు గడిచే కొద్దీ పింగళకానికీ, సంజీవకానికీ మధ్య స్నేహబంధం దృఢం కాజొచ్చింది. పింగళకం ప్రతిదీ సంజీవ

అట్ట చివరి బొమ్మ



కంతో సంప్రతించేది. సంజీవకం చాలా తెలివైనది. అది కరటకం, దమనకం మొదలైన వాటి రహస్యచర్యలు కనిపెట్టి, వాటిని గురించి పింగళకాన్ని హెచ్చరించింది. ఆ కారణంగా పింగళకం వాటిని దూరంగా ఉంచి, సంజీవకం చెప్పే సలహాలు మాత్రమే స్వీకరిస్తూ వచ్చింది.

"అన్నా, కరటకం! మనం నిరాశ్రయులమయిపోయాం. పింగళకానికి సంజీవకంతో కబుర్లు చెప్పటంలో ఎంత ఆనందంగా ఉందంటే, అతగాడు వేటకు కూడా పోవటం లేదు. అందుచేత మనకు బొత్తిగా తిండి లేకుండా పోయింది, ఏం చెయ్యాలి?" అన్నది దమనకం.

"నువు వెళ్ళి హెచ్చరించు. రాజులు వినిపించుకోకపోయినా మంత్రులు హెచ్చరించాలి. గడ్డి తినే ఈ ప్రాణిని రాజుకు పరిచయం చెయ్యటం నీదే బుద్ధితక్కువ." అన్నది కరటకం.

"నిజమే, తప్పు నాదే, రాజుది కాదు. స్వయంకృతాపరాధం. స్వయంకృతాపరాధాలు ఎలా చెరుపు చేసేదీ దేవశర్మ కథ చెబుతుంది గద!" అన్నది దమనకం.

"ఎలాగెలాగూ?" అని కరటకం అడిగింది.

దమనకం ఇలా చెప్పసాగింది:

దేవశర్మ కథ

ఒక మారుమూల ప్రదేశంలో, జనపదాలకు చాలా దూరంగా, ఒక మఠం ఉండేది. దేవశర్మ అనే యతి ఆ మఠంలో ఒంటరిగా ఉంటూ శివలింగాన్ని అర్చిస్తూ ఉండేవాడు. అనేకమంది భక్తులు ఆ మఠానికి విలువైన వస్త్రాలు దానం చేసేవారు. సర్వసంగ పరిత్యాగం చేసి యతి అయినప్పటికీ, దేవశర్మకు బంగారం మీద భ్రాంతి ఉండేది. ఒకనాడు ఆయన మారువేషం వేసుకుని, విలువైన వస్త్రాలన్నిటినీ మూటగట్టి దూరాన ఉండే నగరానికి తీసుకుపోయి, వాటిని బంగారానికి అమ్మి, ఆ బంగారాన్ని ఒక గుడ్డ సంచీలో పెట్టి, సంచీని తన చంకకు తగిలించుకుని,

మఠానికి తిరిగి వచ్చాడు. అటు పిమ్మట, ఆయన ఎవరినీ నమ్మక, రాత్రింబగళ్ళు ఆ సంచీని తన చంకలోనే ఉంచుకునే వాడు. "సంపదను సాధించటం కష్టం; సంరక్షించటం కష్టం; అది పోవటం దుఃఖం, ఖర్చు కావటం దుఃఖం; దాని మూలమే ఖేదం, దాని ఫలితాలు విషాదం," అని ఊరికే చెప్పారా?

ఆషాఢభూతి అనే వాడు దుర్మార్గుడు; పాపభీతి లేనివాడు. ఇతరులది కాజెయ్యటమే వాడి లక్ష్యం. దేవశర్మ చంకలో ఉండే బంగారం ఒకనాడు వాడి కంట పడింది. దాన్ని ఎలా కాజెయ్యటమా అని ఆలోచించాడు. మఠం గోడలు రాతితో కట్టినవి కావటంచేత వాటికి కన్నం వెయ్యటం సాధ్యంకాదు. కిటికీలు చాలా ఎత్తున ఉన్నాయి. అందుచేత ఆషాఢభూతి దేవశర్మ దగ్గిర శిష్యుడుగా చేరి, తియ్యటి కబుర్లతో ఆయనకు విశ్వాసపాత్రుడు కావాలను కున్నాడు.

ఇలా అనుకుని ఆషాఢభూతి దేవశర్మ వద్దకు వెళ్ళి, "పరమశివుడికి ప్రణామం!" అంటూ ఆయన కాళ్ళపై సాష్టాంగ పడ్డాడు. తరవాత అతను దేవశర్మతో వినయంగా, "మహాత్మా, జీవితసాగరం నిరుపయోగమైనది. ఎండుగడ్డి మంటలాగా క్షణభంగురమైనది. సుఖాలు నిర్జల మేఘాలు. బంధు



పుత్ర కళత్రాదులు కలలోని భ్రాంతి. ఈ విషయం పూర్తిగా గ్రహించి మోక్ష మార్గం తెలుసుకోవటానికి తమ వద్దకు వచ్చాను," అన్నాడు.

దేవశర్మ ఈ మాటలు విని, "నాయనా, ఇంత చిన్న ప్రాయంలో లౌకికలంపటాన్ని వదిలించుకున్న నీవు ధన్యుడవు. యౌవనంలో సాధించిన నిగ్రహమే నిజమైన నిగ్రహం. నన్ను మోక్షమార్గం అడిగావు. 'ఓం నమశ్శివాయ' అంటూ శివుడి పైన ఒక్క పుష్పం ఉంచిన వాడికి మరి జన్మ లేదు," అన్నాడు.

ఆషాఢభూతి దేవశర్మ కాళ్ళుపట్టుకుని, "స్వామీ, ఆ మంత్రం ఎలా పునశ్చరణ

చేయాలో చెప్పి, నన్ను ధన్యుణ్ణి చెయ్యండి," అన్నాడు.

"చెబుతాను, నాయనా. అయితే నువు రాత్రివేళ మఠంలోకి రాగూడదు. యతి ప్రాపంచిక బంధాలకు దూరంగా ఉండాలి. అందుకుగాను రాత్రివేళ ఒంటరిగా ఉండటం అవసరం. ఉపదేశం పొందిన అనంతరం నువు బయట ఉన్న పర్ణకుటీరంలో పడుకో," అన్నాడు దేవశర్మ.

ఆషాఢభూతి, "స్వామీ, తమ ఆజ్ఞ శిరసా వహిస్తాను," అన్నాడు.

ఆ రాత్రి పడుకోబోయేముందు దేవశర్మ అషాఢభూతికి మంత్రోపదేశం చేసి, అతన్ని తన శిష్యుడుగా చేర్చుకున్నాడు. అతను రోజూ గురువుగారికి కాళ్ళూ, చేతులూ పట్టి, పూజకు పూలూ, పత్రీ తెచ్చిపెట్టి సంతోష పరిచాడు. అయినప్పటికీ దేవశర్మ తన చంకలో ఉండే సంచీని ఆషాఢభూతికి అందనిచ్చే ధోరణి ఏమీ కనబరచలేదు.

కాలం గడుస్తున్నది. "ఈ మనిషి నన్ను పూర్తిగా ఎప్పటికీ నమ్మడా ? పట్టపగలే ఇతన్ని హత్యచేయాలా? లేక విషం పెట్టనా? లేక గొడ్డును చంపినట్టు కొట్టి చంపనా?" అనుకున్నాడు ఆషాఢభూతి.

ఇంతలో ఒక భక్తుడి కొడుకు వచ్చి, దేవశర్మను మర్నాడు తమ యింట జరిగే యజ్ఞోపవీత ధారణకు దయచెయ్యమని ఆహ్వానించాడు.

మర్నాడు దేవశర్మ ఆషాఢభూతిని వెంటబెట్టుకుని, ఆహ్వానం వచ్చిన గ్రామానికి బయలుదేరాడు. వాళ్ళు కొంత దూరం వెళ్ళేసరికి ఒక నది వచ్చింది. దేవశర్మ తన బట్టలు విప్పి, చంకలోని సంచీతీసి బట్టల మధ్య చుట్టిపెట్టి, స్నానం చెయ్యబోతూ, కాలకృత్యాలు నిర్వర్తించ వలసిన అవసరం వచ్చి, "ఆషాఢభూతీ, ఇప్పుడే వస్తాను. అంతదాకా ఈ బట్టలూ, ముఖ్యంగా ఈ సంచీ చూస్తూ ఉండు. అది శివుడి సొత్తు!" అని చెప్పి వెళ్ళిపోయాడు. దేవశర్మ కనుమరుగైన దాకా ఉండి, బంగారం ఉన్న సంచీ సంగ్రహించి, కాలి సత్తువ కొద్దీ పారిపోయాడు ఆషాఢభూతి.



# 143. భూమధ్యరేఖ మీద మంచుకొండ

ఆఫ్రికాలో భూమధ్యరేఖ మీద ఉన్నప్పటికీ కీన్యా పర్వతశిఖరాలు మంచు కప్పి ఉంటాయి. వీటిలో ఎక్కువ ఎత్తు గల శిఖరం 17,040 అడుగుల ఎత్తున్నది. ఇది ఒకప్పుడు అగ్నిపర్వతం. శిఖరాలను ఎక్కటం చాలా కష్టం. కొండ చరియలూ, లోయలూ ముళ్ళమొక్కలతో నిండి ఉంటాయి.



Photo by D. N. Shirke



బహుమతి
పొందిన వ్యాఖ్య

జగ మేలే పరమాత్మ

పంపినవారు:
ఎస్. జి. ఆర్. భాస్కరబాబు

Photo by D. N. Shirke



ఆర్. ఎమ్. ఎస్. ఆఫీస్,
విశాఖపట్నం–4.

ఎవరితో మొర లిడుదు ?

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు నవంబర్ నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జనవరి 1974 సంచికలో ప్రకటించబడును.

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట: నగరం బయట

మూడవ అట్ట: నగరం మధ్య

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'

